# కాలక్షేపం

## ( TIT - BITS )

### మొదటి భాగము

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

వెల
రూపాయి

మొదటి ముద్రణం, ఏప్రిల్ 1928
రెండవ ముద్రణం 1939
మూడవ ముద్రణం, అక్టోబరు 1940
నాల్గవ ముద్రణం, సెప్టెంబరు 1951
అయిదవ ముద్రణం, జనవరి 1956

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

అణాటికెట్టు పెట్టి, సోమయ్య, ఒకచో గ్రామఫోను వాయిస్తూఉన్న సమయంలో సూది అదే గాడిలోపడటంవల్ల గ్ర్రుమని అదేష్టాని కాగా, శ్రోతలలో ఒకపైన

కైలాసం—ఆ పాడేవాణ్ణి లేచికూర్చుని తిన్నగా పాడమన కూడదూ?

అనగా, నలుగురూ నవ్వగా,

కై—(పక్కవాడి చెవిలో) నాది పొరపాటుగాబోసు! గ్రామఫోను పుంలింగమా, స్త్రీలింగమా?

పక్క—నపుంసకం కూడాను!

కై—అల్లాయితే త్రిలింగా?

పక్క—కాదు. గ్రామఫోనూ, కాళహస్తీకూడా వాయిలింగాలే!

మేష్టరు—ఈ లెక్కకి ఆన్సరు అర్థణా తక్కువ వచ్చిందేం? సోమయ్యా!

సో—నిన్నపొద్దున్న మా బామ్మచేతి కిచ్చానండి.

మే—అడిగి పట్రా రేపు.

సో—(విచారంతో) నిన్న సాయంత్రం మా బామ్మ పోయిందండి.

మరొకబాలుడు—మేష్టాండి, వట్టిదండి. ఈ వేళ, నే చూశానండి!

మే—ఏమిరా, వెధవా! బతుకున్న వాళ్ళమీదేవొట్లు?

సో—మా బామ్మ పోయినట్లు మా నాన్న ప్రమాణికొయ్యంచేసి నెల తిరిగిందండి.

3

అల్లుడు—చూడండి, అత్తా! తొమ్మిదిగంటల బండీకి వెళ్ళాలి. వంట త్వరగా కానీండి.

అత్త—అద్దమా! తొమ్మిదిదాకా ఎందుకు నాయనా, రెండింటికి అయిపోతూంటేనూ!

4

రామయ్య—భీమారావు! సోమన్నదగ్గిర ఎంత ఉందని నీ తాత్పర్యం? క్రియమాట.

భీ—పది లకారాలుండచ్చు. నీ ఊహ?

రా—పది లకారాలు లెక్కేమిటి? దెబ్భై పిల్లికూన్ల పైమాట.

5

తెల్లారకట్ల గదిలోనించే.

దత్తుడు—ఒరేయి, భంట్రోత్! సూర్యోదయం అయిం దేమో, చూడు.

భం—అంతా చీకటిగా ఉంది బాబూ, అయిందేమో, ఏమీ కనిపించడంలేదు.

ద—ఏమిరా వెధవాయీ! కనిపించకపోతే దీపబ్బుడ్డీ పట్టుకు వెళ్ళి చూడాలని తెలియదూ?

భం—చిత్తం. అగ్గిపెట్టి తమదగ్గిరే ఉంది.

వత్తుడుగారిభార్య—పోనీ నిప్పుపుడక మీదగ్గిరే ఉంటే మన పాతికరూపాయల కొత్తలాంతరు ముట్టించి ఇయ్యండి, పాపం! బుద్ధి వెతుక్కుంటాడూ!

6

శనెయ్య—అయితే శాస్త్రుల్లుగారూ! 'గౌరవం' అనే మాట వాడతారు. 'మర్యాద' అని వాడతారు. ఈ పదాలకి ఉండే ప్రయోగతారతమ్యం కాస్తంత సెలవిస్తురూ!

శా—ఎక్కడా నీకు సంబంధంలేనివాట్లతో నువ్వు జోక్యం కలగజేసుకోడం ఎందుకు, పోనిస్తూ.

7

దుర్గారావు—ఏమోయ్! ఈమధ్య నువ్వుకొన్న గుఱ్ఱం ఏమంటుంది?

మంగన్న—ఏమోనోయ్! నే నెప్పుడూ దాన్ని అడిగి చూడలేదు. ఇహ అడగాలి.

దు—సరే. ఆ అడిగేటప్పుడు, తీరా మరచిపోయి ఊరుకోక, ముందునించి అడుగేం!

8

రాజమండ్రీ రైలుస్టేషనులో మెయిలుపైముకి—

శంకరం—ఎక్కడికిరోయ్, భాస్కరం?

భా—ఏలూరు.

శం—మరి, చేతులో దమ్మిడీ ఆడటంలేదన్నావు. నిన్న నాటాకీ ఇవ్వమంటే?

భా—అందుకనే, కానీ ఖర్చులేని టిక్కట్టు కొంటా.

శం—అదేమిటి ?

భా—ఎల్ట్రీన్ టిక్కెట్టు.

శం—బాగుంది. సరే ఏలూరెళ్ళి ?

భా—నాటకం చూడాలి.

శం—దానికి ?

భా—దానికీ అంతే, వాచ్ టిక్కెట్టు.

9

దహనం అవుతూన్న ఒక సత్రంలో పడుకున్న ఇద్దరిలో ఒకడిమీద అగ్నితుట్టలు దిట్టంగా పడడంవల్ల, వాడుకళ్ళు మూసుగునే ఉండి రెండోవాణ్ణి రక్తప్రవాహాలయేటట్లు బరకగా.

రెం—తమ్ముడూ, చీమలురా !

మొ—నాకూ అల్లాంటివే గావుసురా.

రెం—ఒరేయి, నువ్వు నన్ను గోకుతున్నట్టున్నావురా !

మొ—మరి నా ఒళ్ళు ఇంకా ఎక్కడుందిరా ?

రెం—నీచెయ్యి ఇల్లాతే చూపిస్తా.

మొ—దానికీ నన్నే అడ్గాలీ ! నిన్ను గోకేటప్పుడు చూసుగుండూ !

10

భాను—భామయ్యా ! ఈ చెయ్యి చూడు, దీంతో నేను డైలాపేస్తా.

భా—అంత బలాసివిగావును మవ్వు. ఏంపుణ్యంరా.

భాను—బలమేమిటి నీపిండం ? ఇప్పుడు నేను డ్రైవరుగా జేరితేనే !

11

చొక్కా తొడుక్కుని ఒక పల్లెటూరు వెళ్ళిన ఆనందరావు మీద పడి ఆ ఊరివారంతా ఏడవగా.

ఆనం—ఏం ఏం ? ఎందుకూ?

ఒకడు—ఇందులో దేంట్లోనో ఇరుక్కుపోయావు ! జన్మ పిరాయించుగోవాలిగాని, నువ్వు ఇవతలకి రావడం అంచూ మళ్ళి ఉంటుందిషోయ్ !

12

ఒకడు తను గొప్ప వేషధారినని ఒకసభలో కోస్తూండగా,

ఒకసభ్యుడు—ఎవ్వరికీ తెలియనే తెలియదండీ ! సాధారణంగా ఏపాత్రం మీది ?

ఒకడు—అర్జునపాత్రమండి, సర్వత్రా. మొన్న నేను అభినయించిన రాత్రి నాకు ఒక మెడల్ను ఇద్దామని గుసగుస లాడుకున్నారు.

ఒకసభ్యుడు—ప్రసన్న యూదవంనాటి రాత్రేనా.

ఒకడు—మరే.

ఒకసభ్యుడు—మీ వేషాలు నాటకరంగంమీద తప్ప కడం బోట్లలా ఉన్నాయి. మరి గయోపాఖ్యానంలో ఏం వేస్తారు ?

ఒకడు—గయునిష్ఠీవనం వేస్తాను.

13

కామయ్య— ఎక్కడికిరా, రామకృష్ణా !

రామ—బట్టలషాపుమీదికి. చొక్కాలు చింపించాలి.

కా—మొన్న కుట్టించి నెల తిరిగిందోలేదో, అప్పుడే ఎందుకురా మళ్ళీ ! పారేశావా, చిరిగాయా ?

రా—ఉన్నాయి కాని, పిగిలాయి. నెలనెలా ఇదే ఇబ్బంది.

కా—సరిపోయింది. ఈమాటు నామాట విని బనియన్‌గుడ్డ చింపించు, నెలనెలా ఎందుకొచ్చింది ఈఇబ్బంది !

14

ఒకబాలుడు—ఒకబొమ్మ గీసి దానికింద 'అపుదూడ' అని రాయగా—

మేష్టరు—ఏమోయ్ ! నువ్వు ఫస్టుక్లాసు దూడేశావు. మళ్ళీ రాశావుకూడా ఎందుకు. కింద ?

బా—నేను లోపలఅనుకున్నది అందరికీ తెలియడాని కండి.

15

"పుస్తకాలన్నింటిలోకీ అధమాధమం ఐనదానికి గొప్పబహూమతీ !" అని పేపర్లో ప్రకటనచూసి చాలామంది రాయడం మొదలెట్టగా, అందులో ఇద్దరైన వెనకయ్య భూతయ్యలు ఒకనాడు కలుసుగుని, మాటల్లో,

వె—పూర్తిచేశావుటోయ్, బావా !

భూ—ఏదో, అయిందనిపించాను. ఏంపేరెట్టావ్ ?

వె—'విధవేశ్వరవిజయం.' నువ్వు ?

భూ—'కుంకేశ్వరవిలాసం.'

వె—ఏడిశావులే, నాకు యోగ్యతాపత్రిక ఉందిలే మరి. ఒక ఒక గొప్పవాడే ఇచ్చాడు—అనగా నేనేరాస్తే సంతకంచేశాడు. "ఇంత అభాగ్యపుపుస్తకం నేచూడలేదు"—అని.

భూ—నాకూ ఉందిలే మరి, "ఇంత దౌర్భాగ్యపు పుస్తకం ఇదే"—అని.

వె—రెండూ ఓటేలే. మనకే చెరిసహం వస్తుంది బహు మతీ.

ఘూ—కాదులే "అభాగ్యం" అంటే భాగ్యం లేకపోవడం మాత్రమే. "దౌర్భాగ్యం" అంటే దరిద్రం ఉండడం. అంచేత నేనే కొట్టేస్తా.

వె—ఏడ్చావులే! నాదాల్లో సారస్యం, జీవం, ఆత్మ లేవని రాయించి నెగ్గుతా!

ఘూ—నా దానికి శరీరమే లేదనీ, అది అసలు ఏమీ లేదనీ రాయించి నేనే నెగ్గి మరీ నీకు కనపడతా!

16

తెనుగు పాండిత్యానికి పేరుపొంది పోటీలో సంభావన కొట్టిన ఒక దొరగారితో వారి హిందూస్నేహితు డొకడు ముచ్చటిస్తూ.

హిం—మా గ్రంథాలు మీ రేమన్నా చూశారా, అసలు?

దొ—అవును. మీ రామయాణా మహాభరాటాలు మనకు మాంచిస్నేహిటులు. వారిటో మేము ముట్టులో నున్నాము

హిం—ఉన్నారూ, బాగుంది. అయితే మీకు తర్జుమా కూడా వచ్చినట్టే?

దొ—టర్జుమా! ఓ. అడి వెనుకనే వచ్చు.

హిం—ఇంకాకొంచెం సెలవియ్యండి.

దొ—ఉదాహరణా మీకు కావలసినడి: ఇడుగో: 'దహోర్స్ ఈజ్ ఈటింగ్ గ్రాస్'—"గుఱ్ఱముగారు గడ్డి భోజనము చేయుచున్నారు:"

17

కుంటికాలు జగ్గయ్య ప్లీడరుగారు బోనులోఉన్న వెంకటప్ప గారిని 'క్రాసు' చేస్తూ,

జ—మీది ద్వారపూడి కాదుటయ్యా ?

వెం—చిత్తం.

జ—వెనక మీ అబ్బాయిని రాజమండ్రీలో పట్టుగుని పోలీసు వారు కేసు పెట్టలేదూ అతనిమీద ?

వెం—అయితేం ? వెంటనే కొట్టేశారు. అప్పుడు నేను అక్కడేఉన్నా.

జ—అక్కడికి ఎందుకు వెళ్ళారు మీ రప్పుడూ ?

వెం—అక్కడికి వెళ్ళక ఎక్కడికి వెళ్ళను ఓచోటే అహో రించడానికి నేను వట్టి కుంటిముండావాణ్ణి కాదుగామరీ !

18

మంగన్న—ఓ వేసంకాలంలేదు దిబ్బాలేదు, నావీపు ఎప్పుడూ పెట్లుతూ ఉంటుందండీ !

మిత్రుడు—మీభార్య—అనగా మీ కళత్రం—కాపరానికి వచ్చినట్టైనా !

మం—ఆ. ఏణ్ణర్థం అయింది.

మి—ఇహ నేమ్మరీ, అప్పణ్ణించేమో నిదానంగా జ్ఞాపకం చేసుగోండి, ఈ పేలాపన !

19

ఒక ఇంటిఎదట కట్టిఉన్న ఇంగ్లీషునోటీసుబల్ల పరకాయించి చూసీకూడా ఇంగ్లీషు సాంప్రదాయం తెలియని పిచ్చెయ్య లోపలికి చొరబడగా,

యజమానుడు—బొట్ సైడువాళ్ళు లోనికి రాకూడదని తెలియదండీ?

పి—అబ్బో! తెలుసు, తెలుసు! అందుకనే వచ్చాను, మొగాణ్ణిగనక.

20

ఇన్ఫెంటుక్లాసు పరీక్షచేస్తూ ఒక ఇన్స్పెక్టరుగారు తన ఒక్కొక్క చేతులో రెండేసిచొప్పున లక్క గాడిదలు పెట్టుగుని,

ఇ—ఒకటోవాడు, ఇవి ఏమిటమ్మా?

ఒక—గాడిదలండి.

ఇ—ఇవి ఏమి మోస్తున్నాయి? రెండోవాడు!

రెండు—బట్టలండి,

ఇ—ఇక్కడున్న గాడిదలు మొత్తం ఎన్ని? అయిదో వాడు!

అయి—అయిదండి!

**21**

మేష్టరు—ఏమోయ్. బుచ్చన్నా! ఎదీ క్షమార్పణకాగితం? రాసుగొస్తానన్నావ్, క్లాసుపిల్లలఎదట?

బు—ఇదుగోనండి.

అని ఇవ్వగా,

మే—(చూసి) సరే. ఇకనైనాసరే నువ్వు తిన్నగా ఉంటే సరి, నా వాడవే! పట్టిగెళ్ళు.

బు—మీదగ్గిరే ఉంచండి!

మే—ఎందుకూ ?

బు—నేను మళ్ళీమళ్ళీ రాసి ఇస్తూండలేనండీ !

22

బుచ్చిఅబ్బాయి—ఒక్కొక్క కుక్కకి ఉండేబుద్ధి యజమానికికూడా ఉండదు.

గౌరం—(దానికి కుక్క లేకపోయినా) ఒక్కొక్క కుక్క అనక్కర్లేదు. మా కుక్క అల్లాంటిదే.

బు—ప్రతిష్ఠలేనప్పుడుకూడా అటద్ధం ఎందుకూ ?

గౌ—నీకుమల్లే సందర్భాలు కనిపెడుతూకూచోడం నాచేత గాదు, పోదూ !

23

ఎలాగైనా క్లాసు ఎగవేయదల్చుకొన్న ఒక అబ్బాయి మేష్టరుతో,

అ—సార్, నాకు తల నొప్పి దంచేస్తోంది. క్లాసులో కూర్చోలేనండి.

మే—కూర్చో లేకపోతే నుంచో.

అ—పంతులికి అంత కాఠిన్యం పనికిరాదండి.

మే—నిజమే, నీ కవిత్వంలో మృదుత్వం ఉంది.

24

రాలయ్య పూటకూళ్ళఇంటికి భోజనానికివెళ్ళి ఒక రంగంలో, వడ్డించే వాడితో—

రా—ఏమిటయ్యా నీ గడుసుదనం, నాకు తెలియకడుగుతాన్లూ? నాలిక తెంపుగున్నా నాకేమ రాల్చవ్. వాణ్ణివణ్ణో ఆ మూల

కూర్చున్నవాణ్ణిపట్టుకు చెపుతున్నాను, మాంచి దరిపియాణ్ణి మేపినట్టు. పప్పురైటర్ని ఇల్లా పిలు కనుక్కోవాలి!

పడ్డనమనిషి—ఆ పూల ఆయనేనండీ.

25

కొందరు కోతలరాయుళ్ళు ఒక చోటచేరి దారుణాలు చెప్పుగుంటూ,

ఒకడు—ఓడికె యుద్ధంలో గుండుదెబ్బ తగిలి కుడిచెయ్యి ఊడిపోయిందిట. వాడది ఎరగడు. తరవాత ఓ ఘంటకి జేబు లోంచి చుట్ట తీసుగోవలసి, అప్పుడు గ్రహించాట్ట చెయ్యి లేదు కదా అని.

ఇంకోడు—ఇదింతా నయమేనోయ్, ఓపక్షానికీ. ఓడికి గుండుదెబ్బతగిలి, తలా....ఏది!....తలా, బెసికిపోతే తరవాత ఓ ఝాముకి వాడు తల గోక్కోవలిసొచ్చి, మరోగంటకి తల ఊడిపోయినసంగతి గ్రహించడం మొదలుపెడదాం అనుకున్నాట్ట!

26

ఎనభై మంది పిల్లలుగల ఒకానొక క్లాసులో నలుగురు ముగ్గురుతప్ప తక్కినఅంతా హాజరై ఉన్నట్టు తోచగా, ఆ సహస్ర నామాలులాంటివి పిలుస్తూ కూచోడం కాలయాపనం అనుకుని,

మేష్టరు—ఆబ్సెంటు అయిన నలుగురు ముగ్గురూ తంగున నుంచోండి. చట్టున రాసుగుంటానూ!

27

వైద్యుడు—ప్రొద్దున్న ఒక గంటా, సాయంత్రం ఒకగంటా తప్ప నేను వైద్యం చేయనేచేయను.

మిత్రుడు—మరేంజేస్తారు కడంపైమంతా ?

వై—వైదిక గ్రంథాలు చూస్తూంటాను.

మి—అవును. మీవైద్యానికి అపరం వాటి అవసరం ఉన్నట్టు వేటి అవసరమూ లేదు.

28

మార్తాండం—బట్టతలకి ఘట్టిమందంటూ ఇచ్చారు మీరు అబ్బే, ఇదేంమందండీ ! తలకాయ ఊరికే పారణం ముద్దల్లా అల్లానే ఉందిగాని ఎక్కడా గరగరేనా పుట్టందే !

డాక్టరు—ఎందుచేతచెప్మా ! ఈపాటికి కొంత బరిహాస్స విజృంభించ వలసిందేనేమరీ !

మా—ఏమోనండీ ! ఏమైనాసరే, ఇహను నేను ఆ మందు బుడ్లు మట్టుకు తాగను.

29

గడబిడ చేస్తూన్న పిల్లవాడితో ఒక పంతులుగారు కలగ జేసుకుని,

పం—ఏమిటబ్బాయి, అది ?

పి—అదాండీ ! సర్వనామం అండి.

పం—(పిల్లవాణ్ణి ఒక్కటికొట్టి) ఇది ?

పి—(బిక్కమొహంతో) ఇదీ అంతేనండి, కాస్త పొగరు మోతు రకపుది.

30

సత్రంగుమాస్తా—రాసుగోవాలి, భోజనానికొచ్చింది ఎవరెవ రబ్బాయి, చెప్పూ !

అబ్బాయి—నేనొకణ్ణండి.

స—నువ్వు నానదిక్కడ ! నీ పేరు !

అ—రాచయ్యండి.

స—సరే, రాచయ్యా, ఇంకెవరు ?

అ—మానాన్న ఒకడండి.

స—సరే మీనాన్న ఒకడూ. ఇంకా ఎవ్వరూలేరుగద!

అ—అంతేనండి.

స—అంతే ?

అ—ఎవర్నైనా అడగండి కావలిస్తే.

31

పుల్లంరాజు—ఆ నాటకంలో వేషంవేసే ఆయనకి అంత కంతకి చెముడు ముదురుతోంది.

విస్సన్న—వినిపించుగోడం మానేశాడు. ఆ వినికిడి శక్తి కాస్తా ఎగిరి చక్కాపోయింది.

పు—ఏం ? ఎందుకు మానేశాడు ?

వి—ఏమో ! రంగంమీద ఆయన అభినయించే టప్పుడు పుట్టే అరుపులూ, తిట్లూ ఇంకా ఎన్నేళ్ళని వినగలడూ !

32

సరయ్య—ఏమోయ్, సువర్ణలింగం ! ఏమిటా ఉత్తరాలు ?

సు—ఈమధ్య పేపర్లో ప్రకటనఓటి చేశాను. అందు నిమిత్తం జనం పంపుకున్న దరఖాస్తులు !

స—ఏమని ప్రకటన ?

సు—ఎడంపాదం ఒక్కటీమాత్రం లేనివాళ్ళని నాకు రాసుగో మని.

స—ఎందుకూ ?

సు—వాళ్ళల్లో అష్టుడూ నేసూ కలిసి దుర్వ్యయం చేకుండా జాయింటుగా జోడు కుట్టించుకుందామనీ!

33

వేషధారి—ఏమండోయ్. మేనేజరుగారు! మూడో అంకం రెండో సీనులో నేను బ్రాందీ పుచ్చుగోవలిసివస్తుంది. తెప్పించి ఉంచారా ?

మే—తప్పుతుంది బాబూ! అదీ తెప్పించాను. అయిదో అంకం ఒకటోసీనులో నువ్వు పుచ్చుకోవలిసిన విషంకూడా సిద్ధం ఇందాకానే చేయించాను.

34

ఓ పట్టణానికి చేరువగాఉన్న పల్లెటూర్లో నివసిస్తూన్న ఒక దొరసాని తన వదెనగారితో.

దొ—వదెనోయ్! రేపు పట్నంవెడతాను,

వ—ఎందుకు ?

దొ—కొత్తటోపీలు చూడడానికి.

వ—నీకు మతిపోయినట్టుంది. రేపు ఆదివారం షాపులు కట్టేస్తారు

దొ—కట్టేస్తేం ? నే వెళ్ళదల్చుకున్నది చర్చికి.

35

గిరీశం—శాస్త్రుల్లుగారూ! మీరు చుట్టపుచ్చుగోరూ ?

శా—(చిరునవ్వుతో) దానికోసం నలుగురు నౌకర్లనిఏర్పాటు చేస్తేనే! ఒకడు పొగాకు తేవడానికి. ఒకడు అది భేషుగ్గా నౌజులా చుట్టడానికి, ఒకడు అగ్గి తేవడానికి,

గి—మరి నాలుగోవాడు ?

శా—(కోపంతో) కాల్చడానికి.

36

సోంభొట్లు—రమణా ! నీకు తెలుస్తుంది, చెప్పూ ! మామూలుగా నుంచుంటే చాలాసేపటిదాకా కాళ్ళుబరువెక్కక పోవడేం? బుర్ర కిందుగాపెట్టి కాళ్ళు పైకెట్టి నిలబడితే నిమిషంలో బుర్ర బరువెక్కడేం ? నేను నాలుగు మూడుసార్లు చూశాను.

ర—అబ్బో, అదా ! ఉన్నసరుకంతా నీరు కాళ్ళలోనే ఉంది గావునురా.

37

అచ్చంగా ఒకటే పోలికగాఉండే ఇద్దరు అన్నాదమ్ముళ్లో ఒకణ్ణి మార్గవశాత్తూ ఒక శాస్త్రుల్లుగారు కలుసుగుని,

శా—అబ్బాయీ, మాట. అయితేనూ మొన్న యీ మధ్య పోయింది నువ్వా మీ వాడా ?

అ—అదేమిటండోయి, అల్లా అడుగుతున్నారేమిటి ?

శా—ఎరుగుండబట్టి భోగట్టాకోసం అడిగాను. తప్పా ? ఇప్పటి వాళ్ళతో ఏమన్నా నొట్టోపుండే.

38

హోరున వర్షం కురుస్తూండగా ఒక దొర తన ఇంటి సావిట్లో పచారుచేస్తూ, ఈల వేస్తూ, తాళంచెవుల గుత్తి గిర గిర తిప్పుతూండగా, ఒక స్నేహితుడు వచ్చి,

స్నే—ఎవరికోసమో నిరీక్షిస్తున్నారు ?

దొ—ఇంట్లోదానికోసమే. గొడుగులేకుండా బజారెళ్ళింది.

స్నే—అయితేం? షాపులుంటాయిగా, నిదానించడానికీ!

దొ—అందువల్లే మరీ గుండెల్లోరాయడి, కొంప గుండం వేసుగు పోతుందేమో అని తాళంచెవులు పట్టుగు నుంచున్నా.

39

భానోజీ—ఏంరా, రామదాసూ! భారతం రాసింది వీరేశ లింగంగారా, వావిళ్ళ రామస్వామిశాస్త్రుల్లుగారా?

రా—ఎల్లా గ్రహించావు?

భా—వారిపేర్లు మొదట్లోనే కనపడ్డాయి.

రా—ఇదిట్రా నీమాతృభాషాజ్ఞానం! భారతం రాసింది "స్వకీయ ముద్రాక్షరశాల" అన్నసంగతి ఇంకా నీకు తెలియదూ?

భా—మరి మానాన్న, భారతంరాసింది ఘంటం అంటాడేం! పోరా! మనిషిఒక్కంటికోమాటా!

40

శోభనాద్రి—నాయుడుగారూ! రేపు సంవత్సరాదికి నాకు అధికమాసాల్తోటి అరవై యేళ్ళూ నిండుతాయి. ఒక్కటేనాలేదు ఇదివరకు. భేషైనది దింపిపెడుదురూ ఒక ఫొటోగ్రాపూ!

నా—సరే అల్లానే. కాని ఫొజిషను ఎల్లా పెడదాం అంటాడు, ఫొజిషన్?

శో—దానికేం. మాదొడ్లో చెట్టుంది చూశారూ? దాని వెనకాల టోపీ చేత్తోపుచ్చుగునుంచుంటాన్నూ, ఆపళంగాదింపండి.

41

ఒక సైన్యపుతణికీదారు సేన తణికీకి వచ్చి, ఒకనోల్జరు క్షౌరం లేకుండా తెగమాసిన గడ్డంతో రాగా—

త—ప్రతిఉదయం వపసం చేసుగు మరీరావాలని ఎరగవ్ ?

సో—చేసుగునే వచ్చానండి.

త—వెధవఅబద్ధాలు. చేసుగుంటేమరి ఏమిటా బరిహాస్సు?

సో—చేసుగున్నానండి మీరల్లా మసవిచేస్తే నేనేం సెలవియ్యను ?

త—ఛీ. నోరుముయ్ ! గడ్డం మాసిఉంచేనూ !

సో—ఇదండి సంగతి. మేం తొమ్మండుగురం ఉన్నాం. ఇందరికీ ఒకటే అద్దం. బహుశా పూచుపాళ్ళ నేను మరోడి గెడ్డం గీకేశానేమో !

42

అయ్యవార్లు—చిట్టిగా, ఇప్పుడు దేనిమీద పాఠం?

చి—'చర్మం' గురించండి.

అ—చర్మం అంటే ఏమిటి ?

చి—గేదెలూ అవీ తొడుక్కునే కోటండి.

అ—ఓరి పశువా ! ''కోటు''అయితే గుండీలేవిరా ?

చి—లోపలవేపునుంటాయండి. కనిపించవు.

43

హనుమానులు—ఏమండోయి ! కుంభరాడ్కవిగారు ! ఈ మధ్య తమరుగారు ఇంకోపుస్తకం రచించారటగా !

కుం—ఏదోసండి రాశాను, కాని నేను అంత చవటపుస్తకం ఎన్నడూ రాయలేదు.

హ—మీరేకాదు. ఎవ్వడూకూడా రాయలేదను కుంటాను.

కుం—రాయకేం !

హ—అద్దైనా మీ రనకూడదు ఊరుకోండి.

44

శేషం—చూశారూ, శాస్త్రిణః! మా నాన్నగారు కూడా నున్నా గొప్పపండితుల్లో జమస్మండి.

శా—నేనామాట నిన్ను చూడ్డంతోటే పోల్చుగున్నా.

45

పెళ్ళాన్ని వంట పూటింట్లో దిగవిడిచి ఎక్కడికో సర్కీటు కొట్టివచ్చిన ఒకదొర తిన్నగా ఆ వంటపూటి పెద్దమ్మ దగ్గిరికే వెళ్ళి,

దొ—అవ్వా. వచ్చాను తీసిగెళ్ళడానికి. ఏదీ! మా ఆవిడ?

అవ్వ—వచ్చినవాడవు రానేవచ్చావు, నాయన, మరి శాస్త్ర పెందరాళేవస్తే నువ్వేతీసుగెడుదువుగా!

46

అక్కన్న—ఏదో అన్నారు, వంట్లో ఎల్లాఉందోయ్, ఉమ్మన్నా?

ఉ—చాలా జబ్బుగా ఉందనీ, చాలా ఆరోగ్యంగా ఉందనీ కూడా అంటున్నాడు, డాక్టరు?

అ—డాక్టరా. అంటూ డాక్టర్లా?

ఉ—డాక్టరే!

అ—అంత విరుద్ధంగా అన్నాడేం?

ఉ—కకూర్తి! అతనుమాత్రం ఏంజేస్తాడూ? నిన్న పొద్దున్న నేను సెలవు పుచ్చుగోవలిసొచ్చి అతడు నాకు జబ్బు సర్టిఫికట్టు ఇచ్చాడు. నిన్నసాయంత్రం నేను రెండువేలకి ఇన్సూరుచేశాను. అందుకని నాకే. అతడే, ఆరోగ్యం సర్టిఫికట్టు ఇచ్చాడు.

అ—"చావూ" "బతుకూ" అంటూ మాటలు రొండు గాని భావం ఒకటే.

47

టెలిగ్రాం కొట్టడానికి పరదేశిగారు ఆఫీసుకువెళ్ళి, అక్కడి గుమాస్తాతో,

ప—బాబూ, ముందు మా టెలిగ్రాం పట్టండి.

గు—(అఫారంమీద కొన్ని టిక్కులుపెట్టి) మాటలు పన్నెండూ ఉన్నాయికాని, రెండుమూడు మాటలు తెలియడం లేదు. తిన్నగా రాయించుగు రండి. లేకపోతే రాసుగురండి.

ప—నా దస్తూరీ అవతలవాడికితెలుసు. కొట్టెయ్యండి బాబూ మీకెందుకు మా ప్రైవేటుగొడవలన్నీనూ!

48

మీనాక్షి—కాకపోయినా, మహా అయిపోతున్నాయిస్మీ ఈ కాలం పెళ్ళిళ్ళు!

పిచ్చెమ్మ—మరేనండీ పిన్నిగారూ, చోద్యం అవుతుంది! అందులో ఆడపిల్లలకి మరీనూ!

మీ—ఇంకా నిమ్మళంగా అంటావ్వేమిటి? వాళ్ళ సంఖ్యలో సహామేనా ఉండదు, పెళ్ళయిన మొగముండావాళ్ళసంఖ్య.

49

పుట్టంధుడు—పాలు ఎల్లాఉంటాయ్, మాణిక్యాలూ?

మా—తెల్లగా ఉంటాయి.

పు—తెలుపెల్లా ఉంటుంది.

మా—కొంగరెక్కల్లా ఉంటుంది.

పు—మరి కొంగ ఎల్లాఉంటుంది ?

మా—ఇల్లా.

అని మాణిక్యాలు చెయ్యి వంకరటింకరగా పెట్టగా ముట్టుగుని తడిమి.

పు—అయితేమరి పాలు గొంతిక్కి చిక్కడవేం మరీ ?

50

సైకిల్‌మీద టెలిగ్రాపు బంట్రోతు వచ్చి, టెలిగ్రాం ఇవ్వడం తోటే సుభద్రం అదివిప్పి చూసుగుని మొఖం ఇంతచేసుకోగా,

విశాలరావు—ఏమిట్రోయ్, విశేషం ? పరీక్షా, లాటరీఆ ?

సు—ఏదీకాదూ. సష్షన్స్ అయిందిట.

వి—నీకేనా మిటీ ?

సు—కాదు, మాతోడల్లుడికి.

వి—ఎవరిచ్చారు టెలిగ్రాం ?

సు—మా మామగారే.

వి—ఏదీ ఇల్లాతే (అని పుచ్చుగు చూసి) మీ మామగారి దస్తూరీ బాగానే ఉంటుంది, కొట్టూ !

51

మూలస్వామి—దొరయ్యా ! నువ్వు ఎంతో మంచివాడవని నలుగురితోనూ చెబుతూంటాను.

దొ—తమరు ఖంతలని నేనూ అందరితోటీ మనవి చేస్తూంటాను.

మూ—నీమాట నమ్మద్దూ, ప్రపంచం ?

దొ—నీమాట నమ్మేడిశారూ, అప్పిడేను, నామాట నమ్మక పోవడానికి ?

52

ఒక ఉద్యోగస్తుడు మాతృపాఠశాలకి వెళ్ళి తరగతు లన్నీ చూస్తూ నాలుగో తరగతి దగ్గిర ఆగి,

ఉ—బాలులారా! మీలో ఆఖరువా డెవడో నుంచోవాలి.

(అనగానే ఒక పెద్దన్న నిమ్మళంగా నిలబడగా)

ఉ—నీ పేరేమిటి, తమ్ముడూ?

పె—పెద్దన్నండి. స్కూల్లో వెంకటపెద్దన్నారావు.

ఉ—సరే, ఇది పుచ్చుగో

అని ఒక రూపాయినోటు ఇవ్వగా,

మే—బాబుగారూ, ఆ దయచేనేది ఎల్లానూ దయచేస్తు న్నారు గనక మొదటివాడికే ఇస్తే, పోనీ!

ఉ—స్వస్థలంలో దీపంపెడుతూన్నవాడికి ఓ తృణం ముట చెప్పడం తప్పనా తమరనేది! చాల్లేస్తురూ!

53

తల్లి—సత్తెం! ఓరి సత్తెం! ఇల్లారా!

స—(వచ్చి) ఎందుకే అమ్మా!

త—ఇంద! (అని బెల్లంముక్క చేతిలోపెట్టి) వెళ్ళి. పన సాలలోబియ్యం దంపుతున్నారు చూశావ్, వాళ్ళతో, బియ్యం తెల్లగా వెయ్యమని చెప్పిరా!

స—(వెడుతూ) సరే.

త—ఏమని చెబుతావ్?

స—బెల్లం తియ్యగా వెయ్యమంటాను!

54

దీక్షితులు—గుమాస్తాగారూ! మీ ఊరు సంత ఎప్పుడండీ?

గు—పోనీలేస్తురూ మీ కెందుకు ఆ వెథవసంత !

దీ—అబ్బా! మీ ఊళ్ళో అల్లాంటి సంతకేఉన్నారేం జనం? లోటులేదు.

55

సోమప్ప—ఒరేయి కనకం! ఖానోజీ పెద్ద ఖాండం కొన్నాడుస్మీ.

క—ఘటవాయిద్యం చేస్తాడా ఏమిటి?

సో—వీడికివాయిద్యం ఏమిటి? అవతలపట్నంకుంపినీవాడు ఇదివరకే వాయించి పుచ్చుకున్నాడు బాగా రెండు వందలైతే.

క—అబ్బో! అంత పెద్దదిట్రా! లోహపదామిటీ?

సో—లోహం ఎమిట్రా నిందగలెయ్యా! నూట యాభై పుస్తకాలు పైగా ఉంటేను!

56

హనుమంతు—(సిసింద్రీకిమల్లేఉన్న రాజాలుతో) రండి రండి! పర్వతావధానులుగారు!

రాజాలు—(పౌణకంతఉన్న హనుమంతుతో) చిత్తం చిత్తం. వస్తునానండి నల్లమూసంభొట్లుగారు?

హను—నేను తమ తెలివిని గురించేష్మండి మాట్లాడతా, శరీరం కాదు,

రా—నేనూ అంతేనండి.

57

అవధాని—ఏమండీ! యట్టిమేష్టరుగారూ! మా వాడికి ప్రేవేటు చెపుతున్నారుగందా, లెక్కల్లో ఈ కుంక ఎల్లా వున్నట్టూ!

య—లెక్కల్లో మీవాడు "గుడ్" అని వాళ్ళ క్లాసు మేస్టరు ఈ వేళ పొద్దున్నే అన్నారండి.

అ—లెక్కల్లో గుడ్డయితే నువ్వు చెప్పి చచ్చిందేమిటయ్యా మరీ !

58

సోమన్న—ఒరేయి, కోటిలింగం ! నేనూ నాభార్యా, మే మిద్దరం పట్టంలో ఉంటే సాలీనా ఏమవుతుందిరా ?

కో—నువ్వూ నీభార్యా కలిసి పదిమంది పెట్టు. ఇద్దరేమిటి? ఎంతేనా అవుతుంది.

సో—పదిమందేమిట్రా, నీమోహం ?

కో—అవునురా. నీభార్య ఒకటి. నువ్వు సున్న. ధరిమేనా జేరిస్తే పదీ.

59

పంతులు—దానాలన్నింటిలోకీ గొప్పదేది ? భైరవరావు !

భై—అన్నదానమండి.

పం—నీ ఉద్దేశం ? సుబ్బరాజు !

సు—మైదానమండి, గుర్రపుసవ్వారీకి.

లక్ష్మణసెట్టీ—నే చెప్పనాండి ?

పంతు—కానీ.

ల—ఉపాదానం అండి.

పంతు—భేష్. ఇది అన్నిటికీ పైదానం. అల్లానేకానీ, ఒకొ క్కడికి ఒకొక్కటి నిదానం.

60

బ్రాహ్మడు—ఏమట్లుకొచ్చిందోయ్, వడ్డాణం.

కంసాలి—అబ్బే! మెరుగు తరవాయండి.

బ్రా—అదెప్పుడు మళ్ళీ?

కం—ఇప్పుడేగాని ముందు ఈకంటె చూడండిబాబూ!

బ్రా—(చూస్తూ) ఏం?

కం—ఇది కత్తిదని ఏచవటవెధవ అనగలడండీ!

బ్రా—అవునోయి. చాలా దివ్యంగాఉంది.

61

మధ్యవర్తి—ఏమిటోయ్, ఈపేచీ, శ్రీరంగం?

శ్రీ—ఈ తారకం నన్ను తిట్టాడండీ!

మ—ఏమోయ్ తారకం?

తా—చిత్తం.

మ—ఏమనోయ్, శ్రీరంగం?

శ్రీ—"పోరా, వెధవన్నరగా" అన్నాడండి.

మ—ఏమోయ్ నిజమేనా?

తా—చిత్తం.

మ—అల్లాతిట్టచ్చా? ఋజువుచెయ్యలేనిమాట అడచ్చా?

తా—చిత్తం. ఋజువు చేస్తానండి.

మ—ఎల్లా?

తా—ఇతనిపెళ్ళాం పోయినప్పుడు వెధవై, తరువాత ఉంచుకున్న మనిషి పారిపోయినప్పుడు ఒక అర అయాడండి!

62

ఒకస్త్రీ హోరున ఏడుస్తూ పోలీసుస్టేషనిక్కి వెళ్ళి అక్కడి ఇనస్పెక్టరుతో,

స్త్రీ—బాబూ! మా ఆయన మూడురోజుల కిందట కోపం వచ్చి నూతులో పడతా నన్నాడు. మొన్న తప్పిపోయాడు. కాస్త జాలిదల్చి నూతులూ గోతులూ వెతికించండి.

ఇ—మీ ఆయనకి ఆనవాలు చెప్పి వెళ్ళు.

స్త్రీ—మా ఆయనికి ఎడంచెవి చెముడండి.

63

కోరమ్మ—ఎమోయ్, నాంచారెయ్యబావా! మొన్న మన వీధిచివర ఆడవాళ్ళు నిన్ను తిట్టి బుగ్గలొడుస్తున్నారేం? మొగాళ్ళు తన్నుతున్నారేం?

నాం—ఏముంది వదినా! వాళ్ళకి ప్రపంచకపు చరిత్ర తెలియదు. అదీ కర్మదశ!

కో—సరేలే. నువ్వు చేసిందేమిటి అసలు?

నాం—రెండురోజులు వాళ్ళపిల్లకేసి దీక్షగాచూసి మూడో రోజున దాన్ని జుట్టట్టుగుని గబగబా మా ఇంటికి ఈడ్చుకు పోదామని యత్నించాను.

కో—ఏం? అదేంరోగం నీకూ!

నాం—చెప్పలా? "ఎస్కిమో" దేశంలో ప్రేమ ప్రకటించడం అల్లాగేట!

కో—సరేలే. దెబ్బలు నయం అయింతరవాత, ఆదేశం వెళ్ళి ఆ పనిచెయ్!

64

కొందరు ఆడంగులు ఒక డబక్కులరావుని యుద్ధం ఎట్లా జరుగుతోందో వర్ణించమని అడగ్గా.

డ—ప్రస్తుతం ఐరోపా మహాసంగ్రామంలో జర్మనీవాండ్లు లక్షలకొలది రుష్యావాండ్లని ఖైదీలుగా తీసుకుంటున్నారు. కాని, ఆ రుష్యావారు కోట్లకొలది జర్మనీ వారిని లాక్కుపోతున్నారు. ఇల్లా కొన్నాళ్ళకి, జర్మనీ వారంతా రుష్యాలోనూ రుష్యావారంతా జర్మనీలోనూ ఉంటారు. అప్పుడు తమతమ దేశాలకి వెళ్ళిపోయి రావడానికి పునహా పోట్లాట ప్రారంభిస్తారు.

65

ఇద్దరు స్నేహితుల్లో ఒకడు డాక్టరీ ఒకడు ప్లీడరీ ఒక్కమాటే ప్యాసై ప్రాక్టీసు ప్రారంభించగా, కేసు వచ్చేటంత దరిద్రం ఇద్దరికీ పట్టక, చివరకి తల్లి ముగ్గురుచావై డాక్టరికి కేసువస్తే ఆయనవెళ్ళి ఆమట్టున ప్లీడర్ని కాగలించుగుని ఆనందబాష్పాలు ఒలకపోసుగుంటూ,

డా—మిత్రమా! కేసొచ్చింది! వెడుతున్నా, ఆ ఆసామీని చూడ్డానికి.

ప్లీ—(ఆదుర్దాగా) ఆ ఆసామీ "విల్లు" రాశాడో లేదో నేనూ వస్తానోయ్!

66

తెలుగుపంతులు—'పిసినిగొట్టుతనము' — ఏభాషాభాగం? నాలుగోవాడు!

నాలుగో—అవ్యయం.

67

సుబ్బారావు—రత్తయ్యగారూ! ఆ డాక్టరు మీ ఇంటికి వస్తున్నాడుగదా. ఒహొక్కతడవకి ఎంత 'బిల్లు' చేస్తాడు?

ర—అయిదురూపాయలు.

సు—ఎన్నిమాట్లు వచ్చాడు ఇప్పటికి ?

ర—ఇరవైసార్లు.

సు—అల్లాయితే నూరూ అక్కడ కక్కవలసిందే ?

ర—నూరేమిటి నీ బుర్రా, అయిదే! వాడు ఒకసారి వచ్చాడూ! ఆకడం పంధొమ్మిదిసార్లూ ఆ అయిదూ వసూలు చేసుగోడానికి అహోరించాడు.

68

మాణిక్యాలు—అవ్వా ! ఏమన్నా పెట్టవ్.

అ—కోడిగుడ్డు ఓటుంది ఇస్తానుండు, పీల్చుదుగాని,

మా—ఈ పీల్చడంలో కొత్తపద్ధతి విన్నావా ?

అ—ఏమిటి ?

మా—అండజంబునకు నిరుపార్శ్వంబుల సూక్ష్మబిలంబుల నిర్మించి, దానినోష్ఠములతో గబళించి, గంభీర నిశ్వాసంబు గావించినచో తదంతర పదార్థంబు గొంతు ప్రవేశించును. ఇది నూతనపక్కి.

అ—వెనకట్లో గుడ్డుకి చెరోపెడా బొక్కపెట్టి పీల్చేవారు ! అంతాకొత్తే.

69

క్షీరపురంలో "రసపుత్రవిజయం" ఆడుతూ, రాజసింహుడు తనచేత్తో పట్టుగొచ్చిన హాండ్‌స్టిక్కు ముట్టుగుని,

రా—"పూనిచి నిదె ప్రతిన కత్తిముట్టి"

అని పాడేటప్పటికి అంతానవ్వగా,

ఒకడు—అదేంకత్తిరోయ్ ?

అనగా రాజసింహుడు—"మహాత్మా"

అని పద్యంపూర్తిచేసి స్టిక్కులోఉన్న కత్తి పైకి లాగగా,

మరిఒకడు—కర్రకత్తిరోయ్ !

70

బృందావనం—వందనం! ఈకాలంలో గురుభక్తిలేదు.

వం—ఏంజరిగిందేమిటి ?

బృం—ఓకుర్రాడు నాదగ్గిర రెండేళ్ళు ప్రైవేటుగా చెప్పించు గుని నాకు ఇవ్వడంమాట మరిచి చక్కాపోయాడు.

వం—ఏమిటి చెప్పుగుంటా ?

బృం—జ్ఞాపక శాస్త్రం.

వం—అతనిపేరు ?

బృం—ఏదో ఉందయ్యా, నోట్లోఆడుతోంది. ఇట్టే మరిచి పోయానూ !

71

ఒకచోట ఉపన్యాసం పెట్టించినవాడూ, ఇచ్చేవాడూ, రాసే వాడూ మాత్రం హాజరు కాగా, ఇచ్చేవాడు లేచి ప్రారంభిస్తూ,

ఇ—ఆర్య మహాజనులారా !

రా—అప్పుడే కోతలు మొదలు !

ఇ—ఎంచేత ?

రా—చూడండి హాలుకేసి,

ఇ—ఆయన ధర్మబుద్ధితో పేపర్లు అచ్చువేసి పంచి పెట్టడం వల్ల ఆర్యుడు తమరు స్థూలకాయులు కాబట్టి మహాజనులు ఇహానేం ?

72

ఒక గొప్ప లోగిటికి చాలామంది ముష్టికివెళ్ళి అడుక్కుంటూ.

వైదీకి—సీతారామాఖ్యాస్నమః అమ్మా! యాయవార బ్రాహ్మణ్ణి.

నియోగి—(పక్కకి చూస్తూ యజమానితో) చేత్తో ఇక్కడ కూడా కాసిని తగలెయ్యమను!

క్షత్రియుడు—(మీసాలుదువ్వి సకిలిస్తూ) మేము మాత్రం ఎందుకు వచ్చామనుకున్నావు!

కోమటి—యెట్టయ్యా, యెట్టు యెట్టావో, పై లోకంలో పున్యాలు జుఱ్ఱుకున్నానో! దీంటో నాకేంలేదు.

శూద్రుడు—ఏదో కూంతంత సూడుబాబూ, అంతే సేన!

సాహేబు—(కళ్ళుమూసుగుని) మాకీ హుతంగా హదే సెప్పి నామ్!

73

రామారావు—ఏమండీ! కేశవరావుగారూ! మా అమ్మాయి నా పోలికా, తల్లి పోలికా? పట్టింపొచ్చింది చెప్పండి.

కే—ఏమోనండి, తల్లి పోలికేనండీ, నాకు తోచినంత మట్టుకూ!

రా—ఛి ఛీ! మీరుకూడా అట్లా చెప్తారేమిటి?

కే—ఏమిటి నే నన్నదీ!

రా—దానిపోలికేమిటి ముష్టిపోలికా! నా పోలిగ్గానీ! నా స్వంతకూతు రవుతూంటే ఏమిటి మీరీ అడ్డదిడ్డం మాటలూ!

74

దొరసానిగారు చాలా విచారంగా కూర్చుని ఉండగా, దొరగారు ప్రవేశించి——

దొర——ఏమిటిసంగతి ?

దొరసాని——ఏమడుగుతారూ ! అద్దం చేతిలోంచి జారి బద్దలయింది. ఏడేళ్ళు అష్టకష్టాలూ పడాలిగదా అని విచారంగాఉంది.

దొర——నాన్సెన్స్ ! అది వట్టి పిచ్చినమ్మకం. ఒకావిడ వెనక ఇల్లానే బద్దలుకొట్టి అనుకుంది. కాని ఏడేళ్ళూ ఎంత మాత్రం కష్టపడలేదు.

దొరసాని——మరి !

దొర——మూడోనాడు సునాయాసంగా కాలధర్మం చేసింది.

75

రైల్లో, అన్నగారి శవాన్ని తీసుకుపోతూన్న వెంకట్రహ్మాం దగ్గరికి ఒక రైల్వేఉద్యోగి వచ్చి, తణికీచేసి హెచ్చు అక్కడ పెట్టమనగా,

వెం——మావాడికి 'సీజన్' టిక్కెట్టు ఉందండి. అతగాని పని అయిపోయినా, అదిమాత్రం ఇంకా రెండు నెల్లదాకా అయిపోదు. అందుకని వేరే ఏమీ పుచ్చుగోలేదు. పైన మీచిత్తం.

ఉద్యోగి——శవాలికి 'సీజన్' లేదండి.

76

యజమాని——అయితే, బల్లవెడల్పు ఎంత, పెట్టింది ?

వడ్లాబత్తుడు——నాలుగు అడుగులండి.

య——పొడుగు ?

వ—మూడు.

య—అదేమిటీ ? అల్లా ఎల్లాఉంటుంది ?

వ—ఎమోనండి. రెండుదఫాలు కొలిస్తే, రెండుదఫాలూ కూడా పొడుక్కుంటే యెలడ్పే ఎక్కువొచ్చింది.

77

మేష్టరు—'పతము' వర్ణక్రమం చెప్పు—మూలకూర్చున్న ఎఱ్రటోపీ !

ఇనస్పెక్టరు—అదేం పిలుపండోయ్ ! (కుర్రవాడితో) చెప్పమ్మా అబ్బాయి !

ఎఱ్రటోపీ—పకారాకారముల 'పా'

మే—'పతము' లో ఆకారం ఎక్కడుందిరా !

ఇనస్పెక్టరు—లేక పోతే ఎందుకండీ దిక్కుమాలిపతం ?

78

పల్లెటూరిపెద్ద అనిపించుకున్న కాసులు, సుదర్శనంతో మాట్లాడుతూ,

కా—టెలిగ్రాం వట్టి తీగే అని కొందరి భ్రాంతి.

సు—సరిసరి. నీ నమ్మకం ఏమని ?

కా—అది కేవలం గొట్టం. అందులో సరుకులు పంపుతారు.

సు—గొట్టం ఏమిట్రా నీ తలకాయ్ !

కా—పైగా, ఆగొట్టంలో ఎఱ్ఱసిరా పోస్తారు.

సు—ఇదెవడు చెప్పాడ్రా ?

కా—చెప్పేదేమిటి, గ్రహించాను. ఇక్కణ్ణించి తెల్లగా వెళ్లి అక్కడ ఎఱ్ఱగా అందుతుంది టులిగ్రాం కాగితం.

79

రాజమండ్రీ కాపరస్తురాలైన రమణమ్మ తన బంధువు సుబ్బారావు వీధిగుమ్మంలోంచి దాటివెడుతూండగా.

ర—సుబ్బారావుగారూ! ఎప్పుడొచ్చారు? మా యింట్లో ఉండనే ఉండరుగదా? ఎందుకంటారూ? డయలేందే?

సు—తప్పకుండా ఉంటాను. కాని, మీ ఆయన ఏడీ?

ర—తాడేపల్లిగూడెం బియ్యానికి వెళ్ళారు. (తనలో—పైకి వినపడేటట్టు—) అబ్బబ్బా! ఈ చేతిమీద కురుపు అన్నమేనా వండనీయడంలేదుగదా!

సు—సరేసరే. బియ్యమూతెచ్చి, మడీకట్టుగుని, వంటా వండి, తినాతిని మరీవెడతానమ్మోయ్! నా బోటిగాణ్ణెప్పుడూ అతి బలవంతం చెయ్యకు!

80

కనుచీకటి వేళప్పుడు, సామర్లకోటస్టేషను ప్లాటుఫారంమీదికి అంతా మూటలు జేరేసుగుని వచ్చి నిలబడుతూండగా,

అంజయ్య—రాజమండ్రీ వెళ్ళేమేలు వస్తోందొస్తోంది!

చెంచు—(రాజమండ్రీవేపు చూస్తూ) ఏదీ కనపడదేం?

అం—ఆవేపుచూసి లేదంటావేమిటయ్యా; నువ్వెప్పుడూ రైలెక్కనట్టు కనబడుతుంది!

చెం—నేనుమాత్రం ఎక్కినట్టు చెప్పానా ఏమిటి! రాజమండ్రీ మేలూ అంటే రాజమండ్రీలో బయల్దేరి ఇక్కడికొచ్చి నన్ను తీసుగు వెడుతుందేమో అనుకున్నాను.

81

కొడుకు—నాన్నా! పుస్తకాలన్నీ కొన్నానయ్యా. ఇంక డిక్ష్రనీ ఓటి కొనాలి, రొండున్నరా.

తండ్రి—అదంటే ఏమిట్రా, చవటా?

కొ—అర్థాలూ అవీ ఉంటాయి నాన్నా!

తం—ఓరి నీ మోహం ఈడ్చా! అమరమామిటీ?

కొ—కాదు నాన్నా, ఇంగ్లీషుది.

తం—ఏడిశావులే అప్పుడేను. ముందు, కొన్నవన్నీ చవిది ఏడుద్దూ అదీ కొనితగలేద్దుగానీ!

82

అప్పడు—రైలుకి టెక్కెంటెంతేటి బాబు!

గుమాస్తా—ఏడిసినట్టేఉంది. ఏవూరికి?

అ—ఎక్కడికైతేంబాబు! నాయిట్టం!

గు—అది కొన్న తరవాత.

అ—అయితే యిజానారం బాబు!

83

ఒక టీపార్టీ జరిగే సందర్భంలో అశ్లీలపుమాటలంటే చెవి కోసుగునే లక్ష్మణయ్యగారు టీ లోకి తనకి కొంచెంపాలు ఎక్కువ కావలసి, యజమానితో,

ల—అయ్యా! ఆ ఆవుని కాస్త ఇల్లా వెనకాడించి తరుముదు రండి!

అనగా, యజమానురాలికి ఎల్లానోఅనిపించి, పాలువడ్డించే దానితో,

యజమానురాలు—దూడ అరిచేపోటికి వెళ్ళమ్మా త్వరగా!

84

రావు—నిన్న కలెక్టరు షేక్ హాండు ఇచ్చాడండీ!

శాస్త్రి—ఏమి అదృష్టమండీ? మీకే?

రా—అబ్బే, నాకు కాదండి. ఒక గొప్పాయనికి.

శా—సరి. ఆమాటెందుకిప్పుడూ?

రా—అందుకనికాదూ. మొదట నాకేఇద్దాం అనుకున్నాడు లెండి.

శా—ఏం?

రా—ఆయనేమో అనుకుని.

85

కొందరు బియ్యేవిద్యార్థులు భోజనందగ్గిర కూర్చుని ఉండగా,

సుబ్బ—పంకజం! నువ్వెన్ని బూర్లు తినగలవ్?

పం—రెండుమూడూ! ఊహూ ఆబేగాని తీపి మొహం మొత్తిపోతుంది.

సు—నువ్వురా, చంద్రయ్య!

చం—ఆఁ. నేను ఓ సున్నాబూర్లకంటె ఎక్కువ పుచ్చుగోలేనుష్మీ! నీమాట!

సు—నేనూ ఆ రకమే. ఒక్కఅరసున్నకంటె ఎక్కువ నా వల్లకాదు.

చం—జాగ్రత్తస్మీ. అరసున్న కొడవలిలా ఊరుకుని అంగుట్లో గుచ్చుగుపోగల్దు.

86

ఒక అధికారి ఒక అవధాన్లుగారితో వ్యవహారం మాట్లాడుతూ, మధ్య కోపం ఆపుకోలేక,

అధి—చాలు. సంతోషించాంగాని ఇక తమరు ఈ విషయంలో నోరుముయ్యండి.

అవ—నమోన్నమః సంసిద్ధుణ్ణి. కాని, ఎవరిదో సెలవిచ్చారు కారు.

87

పిల్లలికి భూగోళం చెబుతూ,

మేష్టరు—రాండోవాడు ! లే. భూమి పెద్దదా చిన్నదా ?

రాం—పెద్దదేనండి.

మే—మీ నాన్న దాన్నిచుట్టూ నడిచిరాగలడా ?

రాం—నడిచిరాలేడండి !

మే—ఎంచేత చెప్పుమరి చూస్తానూ !

రాం—నిన్నసాయంత్రం ఆయనకి కాలు బెణికిందండి.

88

బొమ్మలురాసే సత్యమూర్తితో,

బంగారమ్మ—నాబొమ్మ వేసిపెట్టాలండి. సరిగ్గా నాకు మల్లేనే ఉండాలి, బాగుండాలి.

స—కుదరదండి. ఏదో ఒకటి మీరేచెప్పండి బాగా ఆలో చించుగుని.

89

వెంకయ్యగారు తలుపు తాళంవేసి ఊరికెళ్ళడం కనిపెట్టి, ఒకడు రాత్రి ఒంటిగంటకి తాళంతియ్యడానికి ప్రయత్నిస్తూంటే ఒక కనిష్టీపువచ్చి.

క—ఎవడ్రా, అదీ !

ఒకడు—అయ్యా : నేసండి, తాళంచెవి ఓటి దొరికింది అది ఈ తాళానికి పెట్టిచూసి సరిపోతే ఇంటివారిని కనుక్కొని ఇచ్చిపోదాం అని చెప్పేసి వచ్చాసండి.

90

ఒక ముసిలిదొర ఒక చంటిపిల్లని పెళ్ళిచేసుకోడానికి చర్చికి లాక్కెళ్ళి అక్కడి అర్చకుడికి కనబడగా,

అ—ఉదకం తూర్పువేపు గదిలో ఉన్నాయి, పట్రండి.

దొర—ఉదకం ఏమిటి మీ మొహం !

అ—అల్లానా ? క్షమించండి. ఈ పిల్లని జ్ఞానస్నానం నిమిత్తం తీసుకు వచ్చారేమో అనుకున్నాను.

91

ఒక పెద్దమనిషి ఒక మురికిబాలుణ్ణి చూసి,

పె—ఒరీ కుఱ్ఱకుంక ! ఏ పెంటమీదేనా దొరికితే నీకు ఓ అణా ఇచ్చుగుంటానుగాని శుబ్బరంగావెళ్ళి స్నానం చేసిరా, చూడలేకుండా ఉన్నాం.

అనగా, వెంటనే వాడు వెళ్లిస్నానం చేసిరాగా, అన్న ప్రకారం ఆయన వాడికి అణాఇచ్చిన తక్షణం తిరిగీ ఆయన చేతులోనే పెట్టి

ము. బా—ఇది మీరే ఉంచండి. ఉంచి ఇదెట్టి క్షౌరం చెయించుగుందురు, బాబూ, బతకలేకుండా ఉన్నాం,

92

షరాబు—డబ్బు ఇవ్వడానికి మరేమీ ఆక్షేపణ లేదుగాని గాని మీరు అచ్చంగా మీరే అనే సర్టిఫికట్టు ఓటి ఉండి తీరాలి,

ఆవిడ—నేను నేనే కదండీ, ఎప్పుడూనూ !

ష—ఆ తెలివి కట్టైయ్యేవమ్మా ! పుట్టుమచ్చలు వగైరాలతో ఒక కాగితం ఉండాలి, లేకపోతే వీలుండదు.

ఆ—అది ఇప్పట్లో పట్రాలేసుగాని నా దగ్గిర ఒక ఉత్తరం ఉంది. అందులో ఒకరు నన్ను పూర్తిగా వర్ణించారు. నేను నే నవునో కాదో చూసుగోండి. మళ్ళీ మా ఆయనతో అనకండిస్మీ ఈ గొడవ !

93

వెంకమ్మ—ఆసంగతి రామక్కతో చెప్పద్దని చెబితే చెప్పేశావూ ?

పుల్లమ్మ—ఎంత మొగవీరుడమ్మా, రామక్కా ! తనతో చెప్పినట్టు నీతో చెప్పద్దంటే చెప్పిందీ !

వెం—సరేలే. ఆమాట నీతో చెప్పనని రామక్కతో చెప్పాను. ఈమాట మళ్ళా ఆవిడతో చెప్పకు.

94

బస్తీస్కూల్లో నాలుగోక్లాసు ఒకడూ అయిదోక్లాసు ఒకడూ చదివేసిన ఇద్దరు అన్నదమ్ములు సెలవలకి ఇంటికొచ్చి ఎవ్వరికీ తెలియకుండా ఇంగ్లీషునే మాట్లాడుకోవాలని సంకల్పించుగుని,

పెద్ద—ఒరేయి ! బురదర్రూ; నాన్న కాల్తున్నాడ్రోయి ! చబ్బున్రారోయ్ !

చిన్న—ఎప్పుడ్రా ? కాల్తా ? నాకు తెలియదే !

పెద్ద—ఇందాకా ఏయిటింటికిరా కాలిందీ !

తల్లి—మీనాన్నేట్రా ఏటింట్లో కాల్తా ! అయ్యో, అయ్యో నా పసుపూ !

95

దుమ్ములోపడి దొర్లుతూన్న కొడుకుని రెక్కపట్టుగు లేవదీసి,

తండ్రి—వెధవమొహం వెధవ! దాడిలో ఏడవద్దని ఎన్ని మాట్లు గద్దెట్టాను? ముష్టెత్తుగుపోతావ్ లే!

అంటూండగా పక్కనించి జగ్గప్ప ఇది విని వచ్చి,

జ—ఎవరండీ ఈకుర్రాడు?

తం—మావాడే. ఏం?

జ—ఏంలేదండి. అచ్చంగా మీమొహమే!

తం—(పొంగిపోయి) ఏదోనాయన! పెద్దలాశీర్వచనం!

96

పెద్దక్లాసులో ఇంగ్లీషుపాఠం చెబుతూ, రంగేశ్వరుడు గారు, మూడేళ్ళు ఆక్లాసే చదివినా ప్రశ్నవేస్తే నోరువిప్పని మారెయ్యతో,

రం—ఛీ! వట్టి శూన్యంలా ఉన్నావేమిటోయ్, నువ్వు! నీ యీడప్పుడు నేను చాంతాళ్ళలాంటి ఇంగ్లీషుప్రశ్నలు ఇల్లా ఊరికో ఉప్పున ఊదిపారేసేవాణ్ణి.

మా—మీ మేష్టరు మంచి తెలివిగలవాడై ఉండాలండి.

ఇంకోవిద్యార్థి—కాదు. వీళ్ళనాన్న తెలివిగలవాడు. ఈన్ని సరియైన మేష్టరుదగ్గిర పారేశాడు.

రం—మామేష్టరు అడ్డమైన అనర్థాణ్ణి చేర్చుకోడం నే నెరగను. పాఠంలోపడదాం.

97

యాభైని నాలుగెట్టి గుణించమని, అయిదు నిమిషాలు ఊరుకుని, ఇనస్పెక్టరు ఒకకుర్రవాణ్ణి,

ఇ—నీపేరేమిటమ్మా.

ఉ—తిలక్ అండి.

ఇ—బాగుంది, నీకు ఆన్సరు ఏంవచ్చింది ?

ఉ —(గుటకలువేస్తూ) మరేమోనండీ, రొండండి.

ఇ—యాభైని నాలుగెట్టి గుడిస్తే యాభైకంటె ఎక్కువొస్తుందా, తక్కువా ?

కు—ఎక్కువేనండి.

ఇ—మరి రొండంటావేం ?

కు—చివర సున్నలుంటే కొట్టెయ్యచ్చని మా అన్నయ్యతో వాళ్ళ ప్రైవేటుగారు చెప్తే విన్నానండి.

98

తాడేపల్లిగూడెం రైల్వేస్టేషన్లో,

ఆచారి—టిక్కెట్లిచ్చే గుమస్తా మీరేటయ్యా ?

గు—మరేనండి,

ఆ—ఇంకా ఆలస్యమేమిటి !

గు—లేదండి.

ఆ—అయితే, రాజమండ్రీగోదావరికి టిక్కెట్టు ఎంత కమ్ముతున్నారండీ ?

గు—ఏడణాలకాని.

ఆ—పావలాఅర్థణాకిస్తారా ఇంకాఏమన్నా బేరముందా ?

గు—అవతలకిపో బ్రూట్ !

ఆ—ఛీ ! ఛీ ! ఇక్కడన్నీ ప్రియమే. బజార్లోనే నయం !

99

షాపుమీదికి వెళ్లి కోటుగుడ్డలరకాలు చూస్తూ షాహుకారు ఖాళీగ ఎడంగా ఉండగా, మెల్లిగా,

బుచ్చిరాజు—ఒరేయి, సరవారావు! ఈగుడ్డ గజం ఎంతో?

స—బహుశా గజం మూడడుగులు అయిఉంటుంది! చాలా నాణెంసరుకుస్మీ.

బు—మరే. మస్నేటట్టే ఉంది. కాని నేను గజం మున్పై ఆరు అంగుళాలు అని ఆలోచిస్తున్నా ఇంకా! తప్పు తప్పు!

స—అద్దమా! ఇహ ఇల్లాంటి తప్పుడాలోచన్లు మానుకో.

100

ఇంటిల్లపాతీ తాగుబోతులైన ఒక నీచపుసంసారంలో,

చిన్నవాడు—ఓలమ్మోయ్! నీలట్రాహే, నింతెగెయ్యా!

పెద్దవాడు—లమ్మనెందుకురా తిడతావ్, తొత్తుకొడకా!

తల్లి—సంటోడిమీద కేక లెందుకురా ఎదవకొడకా!

పెద్ద—నేనా యెదవకొడుకుని? అడిగోత్తానుండు నాన్ననీ!

101

నదీ ప్రవాహంలో కొట్టుకుపోతూ గుటకలువేసి మునిగి చావడానికి సిద్ధమై గిజగిజా తన్నుకుంటూన్న,

చలమయ్య— బాబోయి-సచ్చాను-గట్టుకిలాగండి- బాబోయి!

అని ఒక్కొక్కమాటే అంటూండగా, చాలాదూరాన్నించి ఇది చూస్తూ రెండంగల్లో అక్కడికి పరిగెట్టి, తన "కెమిరా" కర్రలు నిలబెడుతూ,

గంగారామ్—అట్టె ట్టె ట్టె! అల్లానే ఉండు. బాబ్బాబు! ఒక్క చిటిక! కదలకు. వన్, టూ, త్రీ!

102

అయ్యవార్లు—నీకు కాళ్ళెందుకురా, గురవా?

గు—ముల్లువిరిగితేనండీ, తీసుగోడానికండి!

అ—ఛీ! నువ్ రా వెంకన్న!

వెం—గురవడు చెప్పిందండీ, మరేమోనండీ, శుద్ధండీ, తప్పండి.

అ—సరే తరవాత!

వెం—బూజనులు తొడుక్కునేందుకు రాదండీ?

అ—ఏడిసినట్టేఉంది. నువ్ రా పాపిగా!

పా—ఏదేనా తొక్కితేనండీ, కడుక్కోడానికండి!

అ—ఓరిఅపాత్రుడా: ఎరక్కపోయి అడిగాను. కూచో.

103

గొప్ప వేషంలో ఉన్న ఒక పెద్దమనిషి ఒక కాఫీహోటల్లోకి జొరబడి, కొసిరివేయించుగున్న పెరుగుతో వెరసి ఆరు ఆవడలు పుచ్చుగుని, తరవాత,

పె—ఏమయ్యా, వడ్డించే ఆయన!

వ—(వచ్చి) ఇంకేం కావాలండి!

పె—ఈవేళ చేసిందయితే, ఓఅణా 'వగైరా' పట్రా?!

వ—(చప్పరించి) పోవయ్యా! గడుసుదనం!

పె—బల్లమీద రాసుంటేనే?

వ—అదా అర్థం? వెళ్ళవయ్యా!

పె—అల్లాయితే ఏమిటి నువ్వనేమాట ఏమున్నాయి?

వ—ఇడ్లీఉంది, కాఫీఉంది.

పె—అల్లాచెప్పూ! అల్లాఅయితే, రెండుచేతులఇడ్లీ, శేరు కాఫీ పట్రా!

104

బాలుడు—హైం, ఎంతైందండీ, బాబూరావుగారూ!

బా—(బాలుడివీపుమీద ఒక్కటికొట్టి) ఇంతైంది.

బాలుడు—నయమేయింకా. గంటకిందట అడిగానుకొను.

105

పత్రపురంలో 'పాదుక' ఆడుతూన్న సమయంలో వన్స్ మోర్లు చాలాపడటంవల్ల, ఒకసెట్టిగారు తనొక్కడూ ప్రత్యేకంగా అల్లాసే అనదల్చి, ఒకపద్యం అయింతరవాత,

సె—(గట్టిగా) హంసమార్క్ ! పనసమోడ్

అని అరవడంచేత కొంచెరికి నవ్వురాగా,

పక్కవాడు—ఏమిటండీ, సెట్టిగారూ ! మీరన్నదీ ?

సె—మళ్ళీకాస్సేపటికి మీరంతా అనేదే !

106

పంతులు—పద్దయ్యా ! మీ తమ్ముడు బజారుకెళ్ళి పాతిక మామిడిపళ్లు తెచ్చి పంధొమ్మిది పుచ్చిగున్నాడు, నీ కెన్ని మిగుల్తాయి !

ప—అమ్మనాయనా ! అన్నిపుచ్చుగుంటాడేం ? కణకమీద పైడ్ మని, ఒక్క దొడలెంపకాయి ఉచ్చుగుంటాను !

107

పాపారావు—వెంకటయ్యా, గోవిందు చాలాపెద్దమనిషిష్మీ! మాటేనా అడ్డు. నోట్లో నాలికేలేదు వాడికి

వెం—అబ్బా ! అల్లాసేం ? వాడీమాటు అన్నంతినే టప్పుడు చూడాలి.

పా—అప్పుడు లాభంలేదు. దోక్కునేటప్పుడుచూడు.

వెం—సరే, ఈమాటు వాడెప్పుడు దోక్కుంటాడో !

పా—నువ్వెళ్ళి వాడికి ఊరికే కనబడితేచాలు ?

108

కొత్తమేష్టరు—సుందర్నోయ్! నువ్వు మంచివాడవ్.కాదూ?

సుం—అవునండి, మాతమ్ముఁడు మంచివాఁడు కాఁడు.

కొ—అవును. నేను అక్షరాలు చెబుతూంటాను, నువ్వుకూడా చెబుతూండు, ఇంచక్కా. ఏం?

సుం—అమ్మో! నాకేమన్నా పెడితే!

కొ—సరేలే. అడ్డమా! ముందుచెప్పు, ఏం?

సుం—సరే,

కొ—అ ఆ

సుం—హ హా

కొ—ఛీ ఛీ!

సు—ఛీ ఛీ.

109

వెంకయ్య—ఇంగ్లీషుకంటె సంస్కృతం కష్టం.

పుల్లయ్య—కారణం?

వెం—ఇంగ్లీషు త్వరగా చదవచ్చు!

పు—ఇదా కారణం? నీ పిండాకుడులా ఉంది. నువ్వు మొదటి చెప్పిందీ ఈ మాటేగా?

వెం—అవునోయ్, అన్నట్టు.

పు—ఇక నేముంది కారణం?

వెం—నేను అనేశాకాదూ. పోదూ, అదేకారణం,

పు—అల్లాగా ఈ మాట తెలిసింది.

వెం—ఏమిటి?

పు—నీ సంగతి.

110

హాస్యకర్తఅయిన ఒకనటుడు సాక్ష్యం ఇవ్వడానికి ఒకనాడు బోనులో నిలబడి ఉండగా, అవతలపార్టీ ప్లీడరు 'క్రాసు'లో ఎత్తిణ్ణి వంచిద్దామని,

ప్లీ—తమవృత్తి అభినయించడం కదూ!

నటుడు—అవును.

ప్లీ—అది చాలానీచం కదూ?

న—(నవ్వి) అది నాకంతబాగా తెలియదు. కాని ఇది మానాన్నవృత్తికంటె చాలా నయం.

ప్లీ—ఆయనవృత్తేమిటి?

న—ఏముంది? మన ప్లీడరీవృత్తే!

ప్లీ—ఎందుచేత నయం?

న—ప్లీడరీ నిజంగా అబద్ధం, అభినయం అబద్ధంగా నిజం.

111

సుబ్బన్న పూటకూళ్ళ ఇంట్లోకి పోతూ, అక్కడ గల్లాపెట్టి దగ్గిర కూచున్న పూటకూళ్ళఅతనికి వినపడేటట్టు—

సు—ఈ కుండులోనేగదా వెనక మానాన్న ఓ గుఱ్ఱపుకాసు నోమునోపించిందీ!

అంటూ రూపాయి బల్లమీదకొట్టగా, పూటకూళ్ళ అతను పెరుగుటిక్కట్టు కోసి యిస్తూ,

పూ—త్వరగావెళ్ళండీ, "బ్యాచ్" అయిపోతోంది.

అని కుండులోకిదిగి వెతకడం ప్రారంభించిన అరగంటకి సుబ్బన్న భోజనమై రాగా,

పూ—సుప్వు, సరిగ్గా ఎరుగుదువ్ ? ఇక్కడేనా ?

సు—ఇక్కడే, మానాన్న ఆకాసు తీసుగోడం నేసు కళ్లారా చూస్తే!

112

కోటయ్య, తనస్నేహితుడు బుచ్చబ్బాయితో కొంతసేపు దొడ్లో గూటేబిళ్ళ ఆడుకుని, తరవాత ఇంట్లోపడి ఒక అలమారా తెరవడంతోటే దాన్లోఉన్న శవాన్ని చూసి బుచ్చబ్బాయి మూర్ఛ పర్యంతంకాగా,

కో—(నవ్వుతూ) మానాన్నకి ఇదంటే ఎంతో యిష్టం,

బు—(అతిభయంతో) ఏం ? ఎంచేత ?

కో—మానాన్నదగ్గిర మొదట ఈనేట మండుపుచ్చుగుంటా!

113

మాంచి చురుకుఉంటేనేం మరుపుకూడాఉన్న ఒకలాయరు వాదించడానికి తక్షణం రాజమండ్రీ వెళ్ళి, సరియైన కోర్టుకే వెళ్ళినా క్లయింటుపేరు మరిచిపోయి తనగుమస్తాకి టెలిగ్రాం కొట్టగా, తిరుగు టెలిగ్రాంఇస్తూ,

గుమస్తా—తమరు వెళ్ళవలిసింది బెజవాడ. క్లయింటు పేరు మరమేకుల పట్టెయ్య. గమనించండి. తమపేరు అపస్మారక రావు.

114

చాలావేషాలల్తో దొంగతనం చేస్తూన్న ఒకడివి, ఆరు ఫోటోగ్రాఫులు, ఒక అధికారి తన కింద ఇనస్పెక్టర్లకి పంపగా, పంపిన నెలనాటికి,

ఒకఇనస్పెక్టరు—(పై అధికారికి రాస్తూ) అయ్యా, సదరు ఫొటోగ్రాఫులతాలూకు ఐదుగురను పట్టుకొన్నాడను. ఆరవవాని కొఱకు అప్రమత్తుడనై పనిచేయుచున్నాడ. వానిం గూడ పట్టికొని మనవి చేసికొనియెద.

115

ఒక సైన్యానికి సంబంధించిన బ్యాండులో పనిచేస్తూన్న ఒకడికి గొంతుక నెప్పిపెట్టగా,

డాక్టరు—చూడూ ! నువ్వు గొంతుకతోమాత్రం పనిచెయ్యకు, చేస్తివట్టాయనా నెప్పి హెచ్చిపోతుంది. నీకు ఓవారం సెలవు ఇప్పిస్తున్నాను. నే ఇచ్చేమందు రాస్తూండు.

ఒకడు—సరేనండి.

అని వెళ్ళి, వారంరోజులతరవాత నెప్పి కుదిరి బ్యాండువాడు రాగా,

డా—ఏమోయ్ ! నీకు నిమ్మళంగా ఉందా ?

ఒకడు—చిత్తం.

డా—కిందనమాటు అడగాలనుకుంటూనే మరిచిపోయాను. నువ్వు మామూలుగా వాయించేదేమిటి ? సన్నాయా. సృతా ?

ఒకడు—డోలుబాబు.

116

ఒక యజమానిగారికోసం తెల్లారకట్ట అయిదింటికే తేవలిసిన పాలవిషయం వారింటో పనిచేస్తూన్న బండీవాడూ వంటలక్కా జుట్టూ జుట్టూ పట్టుకోగా, యజమాని ఆకేసు విచారిస్తూ.

య—వంటలక్కా ! ఏమిటి నీగోది ?

వ—ఏంలేదండి, వాడికి పచారు చెయ్యడమే పనీ, అందు కని తెస్తాడు. రోగమా ?

య—ఏమోయ్, బండాసామీ ! నువ్వేమంటావ్ ?

బం—మహాప్రభూ ! ఆపని నాదికాదు.

య—ఏమిటిమరి ?

బం—బండి తోలడమేనండి.

య—సరే. నువ్వు తెల్లారకట్ట నాలిగింటికే బండీ కడు తూండు. రోజూ, అందులోఎక్కి వెళ్ళి వంటలక్క పాలు తెస్తూంటుంది. పొండి.

117

మనమడు—తాతోయ్ ! రేపు నే పుట్టింరోజు !

తా—రేపు మాఖశుద్ధ విదియకాదూ ? అన్నట్టు నేపుట్టిం రోజూ అదే !

మనమడు—అల్లాయితే, మనిద్దరం కవలపిల్లలమా, తాతా?

118

రోగి—చాలుగాని, మీకెంతివ్వాలో చూసి చెప్పండి.

వైద్యుడు—చూశానండి. అయిదూ ఆరణాలు.

రోగి—నువ్విచ్చిన మూడుమాత్రర్లకీనా ?

వై—మాటలు తిన్నగారానీండి. మొదటయిచ్చిన సలహాకి అయిదురూపాయలు, తరవాతిచ్చిన మాత్రలకి ఆరణాలు

రో—అల్లాయితే ఈ ఇరవైనాలుగు కాన్లదొత్తరా ఉంచండి.

వై—సరే. మొదటిదానిమాట ?

రో—అదా ! అది మాయింటో ఎక్కడచూసినా అదే! ఇంకా ఎందుకు కొనడం ?

119

ఒక ఆరితేరినకేడీ బోనులో నుంచుని జడ్జీగారితో,

కే—మహాప్రభూ ! మా ప్లీడరుగారు రాలేదు, ఆయనకి వీలు లేకపోయి ఉంటుంది. ఒకవారం గడువు కటాక్షించాలి.

జ—(అక్కడనుంచున్న ఫిర్యాదిని చూపించి) ఆ ఘరానా మనిషి జేబులో నీచెయ్యి ఉండగా నిన్ను బరిమీద పట్టుగున్నారుగా?

కే—చిత్తం !

జ—అల్లాంటప్పుడు, ఇక నీప్లీడరు వచ్చి మాత్రం ఏం వాదిస్తాడూ ?

కే—నాకూ అదే చూడాలని మహాఉందండి లోపల.

120

కృష్ణమ్మ—ఏమోయ్, ఆనందం. గుర్లింగం వట్రంగం ఎల్లా చేస్తూన్నట్టు ?

ఆ—(తలడూగించి) చేస్తున్నాడు, యథాశక్తి ! మొన్న పొద్దున్న రెండువందల రూపాయల పేకుపలక అప్పచెబితే, గాలితిరిగేవేళకి రూళ్ళకర్రకేనా పనికిరాకుండా చెక్కేశాడు.

కృ—ఏం చెయ్యమనిచ్చారు ?

ఆ—ధ్వజస్తంభం !

121

సాంబం—అక్కయ్యా ! బావ చాలామంచివాడుసుమీ.

కాంత—మరే, మండిపోతోంది మంచి !

సాం—అల్లాయితే, మా పెద్దవాడు.

కాం—ఆమాత్రంగూడానా, బతుక్కి !

సాం——అల్లాయితే వావకి మంచీ చెడ్డా లేదు.

శాం——సరే. మంచీఉంది, చెడ్డాఉంది. అది నీకు తెలియదు గనక నువ్వు చెప్పడానికి వీల్లేదు, నాకు తెలుసుగనక చెప్ప డానికి వీల్లేదు.

122

క్షౌరంచేసి కొత్తమంగలి వెళ్ళిపోయింతరవాత,

కనకయ్య——(కూతురుతో) అమ్మా, నీళ్ళుపట్రా

కూ——స్తానానికేనా ? నాన్నా !

క——నోట్లో పోసుగోడానికి.

కూ——ఎందుకూ ?

క——నోట్లోపోసుగుని, పెదిమిలుబిగించి, నీళ్ళంటాయో కారిపోతాయో చూస్తా.

123

బిచ్చగాడు——చూడ కళ్ళులేవు. నారాయన్నారాయన !

సుబ్బలక్ష్మి——ఎప్పణ్ణించి నాయనా నీకీ అవస్థా ?

బి——వారం రోజుల్నించి, తల్లి.

సు——హుఁ, ఇప్పుడు కళ్ళుకనబడకపోవడం మామూలై పోయింది. ఏంచేతొచ్చింది నాయనా నీకీ దురవస్థా ?

బి——అదివరకు మూగాణ్ణి, అది కిట్టక ఇల్లా అయాను.

124

భార్య——ఇదిగోనండి ! మీకు మల్లెదండ కట్టించాను, బహుమతీగా.

భర్త——దేనికి ?

ధా—ఈ వాళ తమరు పెళ్ళాడిన రోజుమరీ ?

భ—ఒహో, సరె. నువ్వు పెళ్ళాడినరోజు వచ్చినప్పుడు కుడా నాకు కాస్తజ్ఞాపకం చెయ్యేం! యధాశక్తిగా ప్రతిమర్యాద చెయ్యాలి.

125

కారణాంతరంవల్ల కృష్ణారావుగారు నూతులోపడగా నలుగురూ పోగై, తాళ్ళతోకట్టినతట్ట నూతుతోకిదింపి,

ఒకడు—ఇహ తట్టలోకె జేరుకోవయ్యా, పెళ్ళికూతుర్లాగా!

కృ—(నూతులోంచి) ఉండండెహెయ్, మీసిగ్గొయ్యా, ఫొడుం పీల్చుగోవాలి.

126

సుబ్బరాజు—కామోజీ! మన అరుణాచలం దొరలా వేషం వేసి అందరికీ షేక్‌హాండు ఇస్తూంటాడూ, వీడి హృదయం ఎల్లాంటిదోయ్ ?

కా—మంచిదే!

సు—అయినా ?

కా—కాని, షేక్‌హాండు అనంతరం మనవేళ్ళు ఒకమాటు మళ్ళీ లెక్కచూసుగోడం అంతకన్న మంచిది.

127

పంతులు—ఒకటోవాడు! 'సుందరము' అనేమాట వాక్యంలో ఉపయోగించు.

ఒ—"మీ ముఖము సుందరము"

పం—భేష్. రొండోవాడు! నువ్వు 'సుందరతరము' ఉపయోగించి చెప్పు!

రాం—"ఓీ ముఖము పండుకోతి ముఖముకన్న సుందరతరము"

పం—ఓరి కొండముచ్చు వెధవా !

128

గుర్రాజుగారు బంట్రోతు కూర్మయ్యతో,

గు—ఒరేయి, నాకు ఆనందంగా ఉన్నప్పుడు జ్ఞాపకం చెయ్యి, జీతం ప్రమోషను చేస్తాను.

అని అన్న, వారంరోజులకి కూతురికి చాలా సుస్తీగా ఉండి, ఆ అమ్మాయిని పడుకోపెట్టిన గది వాసనగా ఉండడంవల్ల అగరు పుల్లలు తెమ్మని, చిల్లరిలేక రూపాయిచ్చి కూర్మయ్యని పంపగా, కూర్మయ్య 'అగరు' మాట మరిచిపోయి ఓరూపాయి పుల్లలు పట్టించుగు రాగా,

గు—(దీనంగా) హారి ! ఇదేమిరా ? (అని చిరునవ్వు నవ్వగా)

కూ—చిత్తం ! ప్రమోషన్. మహాప్రభో !

129

హరికథకి వెళ్ళి ఆ హడావిడిలో చెప్పులు కొట్టేసివచ్చిన ఇద్దరు మాట్లాడుకుంటూ—

ఒకడు—నువ్వేం లాక్కొచ్చావురా ?

రెండోవాడు—బూడ్సులజోడు, నువ్వు ?

ఒ—ఒక ఆకుచెప్పూ, ఒక చెడావూ.

రెం—ఇదేమిట్రా నీ తలకాయి ?

ఒ—తలకాయే మరి. యజమాన్లు ఒక్కొక్కటే పట్టికెళ్ళలేక ఆరెండూ విడివిడిగా అక్కడే చుట్టుప్రక్కల పారేసి పోతారు. రాత్రి పన్నెండింటికెళ్ళి ఆరెండూ నొల్లుకొస్తా.

130

చాలాభాగం హరిశ్చంద్ర నాటకం చూసి కామరాజు తన స్నేహితుడు నరసింహం చెవిలో—

కా—ఈ హరిశ్చంద్రుడు వట్టి వెర్రినాయనస్మీ, నన్నడిగితే!

న—ఏం? ఎల్లా కనిపెట్టావ్?

కా—ఆ రాతి విశ్వామిత్రుడిమీద తన మైనరు కొడుకుచేత స్థిరాస్తికి ఓపాపరుదావా వెయ్యించకూడదూ? దానివల్ల తన సత్యవ్రతానికి లోటేమిటీ?

131

తన స్నేహితురాలు ఎక్కడ కాపరంఉందో ఎరగని ఒకరు ఒక ఇంటివగ్గిరికి వెళ్ళి, అక్కడ, ఆ స్నేహితురాలి కొడుకు కూర్చుండడం కనిపెట్టి, ప్రాణం కుదుటబడి,

ఒక—మీఅమ్మ ఇంట్లో ఉందిరా కుర్రాడా?

కు—ఎందుకూ?

ఒ—అట్టే ఎదురుప్రశ్న లెయ్యక, ఉందో లేదో చెప్పు.

కు—ఉంది.

అనగా, ఆ ఒకరు ఆ ఇంట్లో దూరబడి, అందులో ఎవరూ కనబడక తిరిగివచ్చి,

ఒ—లేదబ్బాయి.

కు—ఉందండి.

ఒ—ఏడిశావ్. నే చెడవెతిగితేనే ?

కు—అన్నటు, మాయింట్లో ఉందండి.

132

ఒక గవర్నమెంటుకాలేజీలో ట్రైనింగువిద్యార్థి కేవలం తన స్వంతకార్యం సంపర్భంలో వెళ్ళవలిసివచ్చి, సెలవర్జీ రాయగా ప్రిన్సిపాలు అది మంజూరు చెయ్యకపోగా స్వయంగా ఆయనతో మాట్లాడడానికి వెళ్ళి,

వి—సెలవు తప్పకుండా కావాలండి.

ప్రి—ఏమిటి కార్యం ?

వి—నాకార్యమేనండి.

ప్రి—ఏమైనా సరే, డాక్టర్ సర్టిఫికెట్టు ఉండాలి.

వి—దీనికి ఇవ్వరండి.

ప్రి—ఇవ్వకపోతే ఎల్లానో పుట్టించుగు రా. వెళ్ళు.

133

సుందయ్యగారిపెళ్ళాం, గార్లు నందికేశ్వరుడు నోం చేసుగుంటూ మొగుడుతో—

పె—చూడండీ! చూరుదాటి పదార్థం అవతలకి వెళ్ళరాదుట. ఇంట్లోఉన్నది మీరొక్కరేగనక ఓసలుగుర్ని కేకేసుగొస్తురూ !

సుం—ఎన్ని శేర్లు పోసింది ?

పె—అయిదుశేరొయ్యకపోతే ఎల్లాపనికొస్తుంది ?

సుం—అంతేగద ! అట్లాయితే చూరుదాటి ఒక్కర్నీ పిలవక్కర్లేదు.

134

శంభన్న సత్రంలో తన సహపంక్తిని భోజనంజేస్తూన్న గోపాలంతో,

శం—గోపాలం! మన పంక్తిని చివరటన్నాడు చూడూ ఓ జంతువూ! ఆయన అంతున్నాడేమిటీ? సింహద్వారం ఎల్లా పట్టిందోయ్, వాడికి?

గో—సరే. పట్టడంలేదు గిట్టడంలేదు. వాణ్ణి లోపల ఉంచే కట్టారట సత్రం.

135

శరీరశాస్త్రం చెప్పుగుపోతూ, మధ్య,

ఉపాధ్యాయుడు—హృదయము నాలుగుభాగములు. కుడి వెంట్రికిల్, ఎడమవెంట్రికిల్....

అనగా, ఇదంతా పరధ్యానంగా వింటూన్న

రాజ్యం—హృదయంలో అపేమిటండోయ్! మేష్టారు!

136

వెంకటేశం—ఏమండీ గిరీశంమేష్టారూ! మన్ని ఎవడేనా ఎడం దవడమీద వాయిస్తే, కుడిదికూడా ఒగ్గమంటారు, కవి హృదయం ఏమిటక్కడ?

గి—కొట్టేవాడు అర్భకుడైనప్పుడు తలకాయకి పక్షపాతం జరక్కుండా అల్లా సూత్రించారు. కాని, తలకాయచేసే ప్రదక్షిణం పూర్తి అయేటట్టు కొట్టేవాడికి ఇదివర్తించదు!

137

మేష్టరు—ఒకమనిషి గంటకి పదిమైళ్ళు పరుగెత్తుతాడు. పదిగంటల్లో ఎంతదూరము పరుగెత్తుతాడు? చెప్పు! నూకయ్య!

నూ—సాలాదూరం యెల్తాడండి, యెల్తేని, అసలు యీ లోపులో సత్తాడండి!

138

అన్న—తమ్ముడూ! మాయపరం అర్జెంటుగా మనిషిని పంపాలి. మాచిరాజు చురుకైనవాడే?

త—(చప్పరించి) ఏమో, ఈ మాచిరాజుని వెనక మామయ్యకి జబ్బుచేసినప్పుడు మాత్రకోసం పంపిస్తేనూ, మాసికంనాటి కొచ్చాడు!

139

కాయిలాగాఉంటూన్న లక్ష్మణ పెరుమాళ్ళుగారికి ఓసారి జబ్బు ఎక్కువై ఇక ఆర్టేరోజులు జీవించడనుకున్నప్పుడు,

భార్య—(కొడుకుతో) అబ్బాయీ! మీ నాన్న ఉన్నన్నాళ్ళుండరు. వారికి గార్లిష్టం, ఓ శేరు మినుములు పట్రా! అవొండి పెడతాను.

అనగా, ఈమాటలు లక్ష్మణ పెరుమాళ్ళు విని,

ల—శేరెందుకూ? నేనొక్కణ్ణీ అన్ని తినగల్నా, పోనీ సోలెడు తెమ్మను, తరవాత ఎల్లానూ కావాలిగాంసు!

140

మంగమ్మగారు పక్కింటి వెంకమ్మగారితో,

మం—మా మేనమామ పెళ్ళాం వచ్చిందమ్మా మొన్న చూచి వెళ్ళడానికీ! ఇల్లా కారప్పూసేనా పట్రాలేదుషీ్మ? ఉత్తమనిషి చక్కావచ్చింది.

వెం—అల్లానా! కించనమాటు మనం మాట్లాడుకోడంతో అవిడ ఉత్తమనిషి కాదన్నారు.

141

సత్యభామ—(దొంగ ప్రియుడితో) మనోనాయకా, జీవితేశ్వరా ! మీఫొటోగ్రాపు ఓటివ్వరూ నాకూ ?

ప్రి—అదెవరేనాచూస్తే నీదగ్గిర ప్రమాదం కాదూ.

స—ఇంతపిరికివాడు ఎల్లాపనికొస్తారండీ ! పోనీ, ఫొటోతీసేవాడితో ఫొటో మీకుమల్లే తియ్యద్దని చెబుతాలెండి.

142

బసవన్న—చంద్రంబావోయ్, ఎల్లానూ వెడుతున్నావుగనక, రామారావుని చాలాచాలా అడిగానని చెప్పు. వాణ్ణెరుగుదువా ?

చ—ఎరగనోయ్, కర్మం ?

శ—సరేలే. పోనీ అల్లాయితే అడగలేదనిచెప్పు.

143

పూటుగా పులిహోర లాగి, అది మారు తెచ్చినప్పుడు పుచ్చుగోడానికి కాళీ లేదని చెప్పి, తరవాత మళ్ళీ రొండుపుంజీల బూర్లు గుమ్మరించినా కిక్కురుమనకుండా ఊరుకున్న పున్నయ్యతో.

నాగయ్య—ఇందాకా కాళీ లేదనవుటయ్యా !

పు—సరిసరి. నీకు శరీరశాస్త్రంలో ఓనమాలే తెలియవే ! పొట్టలో పులిహోరసంచీ వేరూ, బూర్లకోశం వేరూ !

144

సంయుక్తపరగణాలల్లో ఒక గ్రామస్థుడు తన స్నేహితుడితో ముచ్చటిస్తూ.

ఒక—ఎగేసేవాడికి రోజులు. కాని, విధివిధాయకంగా పని చేసేవాడు ఇప్పట్లో కంట్రకుడు.

న్నే—ఏం జరిగిందేమిటి ?

ఒక—మొన్న జనాభాలెక్కల్లో నాకు ఒక చిన్న "బ్లాకు" ఇచ్చారు!

న్నే—ఇస్తే ?

ఒక—అది, ఏడింటికి మొదలెడితే, పదినిమిషాల్లో పూర్తి అయింది.

నే—అయిపోతే ?

ఒక—లెక్కసమాప్తి మరి రాత్రి పన్నెండింటికిగా! ఈ ఈలోపున మరిఎవరేనా నీళ్ళాడేరేమో, లేకపోతే పోయారేమో కనుక్కోవద్దూ ? కాని, గర్భిణీవాళ్ళు ఆ బ్లాకులో లేనే లేరు. అదికనుక్కో అక్కర్లేక పోయింది.

న్నే—ఇకఎవరేనా పోయారేమో అని నువ్వు కనుక్కుంటోచ్చావుగావును!

ఒక—ఓ మాటా ? ఎంతసేపటికీ పన్నెండు కాదాయిరి. అయిదుమాట్లు "ఎవరేనా పోయారండీ, ఇక్కడా ?" అంటూ కేకేస్తూ తిరిగేటప్పటికి జనానికి నా మీద అసహ్యం పుట్టింది.

న్నే—పదిమాట్లతో ?

ఒక—పదిమాట్లతో "అయ్యా ఇకపడుకో" అన్నారు. పది హేనుసార్లతో "తంతాం జాగ్రత్త" అని బెదిరించారు. సరి ఇరవైసార్లలో-అప్పటికింకా పదకొండుకంటె టైము ఎక్కువై తగులడలేదు-నా కుడీకాలు బొప్పాసిగొట్టం విరచినట్టు విరిచారు. ఇంకా గంటటైమున్నా వెళ్ళలేక ఊరుకున్నాను,

145

నరసుపంతులు—ఏం రామమ్మా! కులాసాగా ఉన్నావూ ?

రా—చిత్తం.

న—మీ వాడికి ఉత్తరం వేశానన్నావు, జవాబురాశాడూ ?

రా—లేదు, నాయనా !

న—ఏం ? చిరునామా సరిగ్గా రాయించావా ?

రా—ఆ,

న—ఏమని రాయించావు ?

రా—మావాడు ! ఊరికెళ్ళాడు ఎక్కడున్నాడో కనుక్కుని తక్షణం ఈఉత్తరం ఇవ్వాలని రాయించానండీ !

న—పోనీ, ఆ ఊరిపేరు రాయించకపోయావ్ ?

రా—ఇల్లారండి, (అని రహస్యంగా) ఆ ఊరు వాడోరహస్యపు పనిమీద వెళ్ళినప్పుడు ఎల్లా రాయించటం ?

146

చిరంజీవి—శాస్త్రుల్లుగారూ ! ఆ కనిపించే గట్టు ఏమిటండీ ?

కామశాస్త్రి—చెరువు.

చి—స్నానానికి వీలేనా ?

కా—కొబ్బరికాయలు కొట్టచ్చు.

147

ఒక అంటకత్తెరక్రాపింగు పెద్దమనిషి ఒక యాజులుగారితో వాగ్యుద్ధం చేస్తూ, ఒక రంగంలో,

పె—వెధవంతవాడవయ్యా, జుట్టుతేడాగానీ :

యా—తమకు ఆతేడాకూడాలేదు. ఒక్క ముసుగు మట్టుకు తరవాఖు,

148

నరసింహం—నారాయణమూర్తీ! ఈవెంకడు చంపేస్తున్నాడోయ్. పనిమీదపోతే అదేపోత! చీటికీమాటికీ ఏదో ఉంటూంటుంది. అందడు.

నా—వాడికి జుట్టుపిలక ఉందా?

న—ఆ. ఉంటేం?

నా—మీ ఇంట్లో నులకమంచం ఉందా?

న—ఉంది. ఎందుకూ?

నా—ఆ తాడు విప్పి, ఉండకింద చుట్టి వాణ్ణి ఎక్కడికేనా పంపుతావు అనగా ఓ చివర వాడిజుట్టుకి రాయిలా పీటముడేసి, వాడితో పనున్నప్పుడల్లా రొండోకొస లాగుతూండు.

149

కొండలరావుగారు జిగురుతొట్టిలోఉన్న జిగురుతో ఉత్తరం అంటించడం చివరదాకా చూసి,

రత్తమ్మ—నాన్నా! ఇది మళ్ళీ తియ్యొత్తా?

కొం—ఆ. నీ కెందుకులేస్తూ, తొట్టి గూట్లో పెట్టిరా.

ర—అమ్మకిత్తాను.

కొం—ఎందుకూ?

ర—అన్నయ్యేం, అమ్మదాతిన దబ్బులు తీత్తునాత్త! దీంతో కల్లు అంతింతమంతాను. మళ్లీ తియ్యత్తుగా!

150

గోవిందశాస్త్రి—అందుకనే కదండీ, నారద మహామున్లవారు, ఎంత మహాత్సంపన్నులైనా, ఎంత దేవమునైనా,

నిత్యమూ నున్నూ కుడా ఆయొక్క శ్రీకృష్ణభగవాన్లవారి దర్శనం విడవకుండా పొందుచూండే వారషా!

గిరీశం—డామిట్. నాకు తెలియనట్టు చెప్తారేం? కృష్ణుడు ఒక షెపర్డ్-అనగా గొల్లవాడు. అతనికి పాలు లావుగా ఉండేవి. ఇది కనిపెట్టి కానీ ఖర్చుకాకుండా రోజూ కాఫీపైమిక్కి మిష్టర్ నారదుడు కృష్ణుడు లాడ్జికి జేరుకునేవాడు.

151

సుబ్బారాయుడు—వెంకన్నా! రాత్రివేళ స్మశానంలోకి నువ్వు ఒక్కడవూ వెళ్ళగలవ్?

వెం—దంచేసి.

సు—ఏడిశావ్. మొఖం తేలేస్తావు భయమేసి.

వెం—ఛీ. కావలిస్తే కూడా వచ్చిచూస్కో.

152

నాటకశాలలో,

పరాత్పరరావు—ఏమండీ! ఆ అశ్వత్థామ శాలువ పైన తెల్లటిది ఏమిటి?

పూర్ణానందం—దంధ్యం.

ప—అది పైన వేసుగున్నాడేం?

పూ—ఇహ కాస్సేపట్లో తనికి దారుణకోపం వస్తుందనీ, అప్పుడు తను దంధ్యం తెంపుగోవలివస్తుందనీ, వాడెరుగు. చేతి వీలుకోసం పైన పెట్టుగున్నాడు.

153

శాస్త్రిగారు రాజమండ్రీనించి ధవిళేశ్వరం జట్కా కట్టించి, పోనిమ్మని బండివాడితో అంటూండగానే గుర్రం చెయ్యంగా.

బండీవాడు—అయ్యా! గుఱ్ఱం వెనక్కి నడుస్తోంది.

శా—నాకూ తెలుసు. ఇప్పుడు నేను ఏం చెయ్యవలసి ఉంటుంది?

బం—దిగాలి.

శా—నీకు చాదస్తంగాని దిగడం ఎందుకూ? బండీ రాజమండ్రీకేసి తిప్పితే సరీ, పని జరిగిపోతుందీ!

154

సావిత్రినాటకం ఆడటంలో యమధర్మరాజు ఓపద్యం చదవగ్గా,

ఒకడు—వన్సుమోర్!

పక్కవాడు—ఓయి నీ మొహంమండా, మళ్ళీ ఎందుకయ్యా చదవమనడం? నీమాట పట్టుగుని వాడు ఇందాకటికంటె గట్టిగా పద్యం మళ్ళీ చదివితే, ఇహ అక్కడికి మేమంతా వినవలిసిందే?

155

బల్లకట్టులేని మురుక్కాలవకి అడ్డంపడుతూ,

చంద్రుడు—జాగర్తోయ్! సత్తెన్నశాస్త్రీ!

స—నీ జాగ్రత్త నువ్వుపడుదూ! నాకేమిటీ! నేను గోదావరిలో నాలుగైదార్సారులు ఈదినముండావాణ్ణీ! మొన్న రథసప్తమికి అక్కడేఉన్నా!

చం—అల్లాన్టోయ్, చెప్పావుకావేం? అయితే మొన్న రథసప్తమినాటిది ఎన్నోఈత?

156

నాగయ్యని దవడలెంపకాయ కొట్టినందుకు వెంకట్రామయ్యకి అర్థరూపాయి జుల్మానా విధించాం అని జడ్జీగారు

తీర్పుచెప్పిన ఉత్తరక్షణమే వెంట్రామయ్య వెళ్ళి నాగయ్యని సాగదీసి ఇంకొకటికొట్టగా,

జడ్జి—ఏమిటది ?

వెం—రూపాయి, ఇదిగోనండి !

జ—మా సమక్షమందు ఏమిటి అల్లరి ?

వెం—అల్లరీలేదండి, చిల్లరీ లేదండి ? క్షమించాలి.

157

ఒకశర్మగారు ఒకహైస్కూలికి వెళ్ళి, అక్కడ హెడ్ మేష్టరుతో,

శ—మిమ్మల్నేనా, హెడ్మేష్టరనేది ?

హె—అవునండి. కూచోండి. ఏం !

శ—ఏం లేదండి మావాణ్ణి థర్డుఫారంలో జేర్చాలి.

హె—(బల్లమీద ఒక చిన్నకాగితంముక్క చూస్తూ) థర్డు ఫారం ! సీట్లు లేవండి.

శ—అంటే ఏమిటిబాబూ ?

హె—సీటా ? సీటంటే కూచునేది.

శ—అదా ! తమరు అతిమర్యాదాకోసం దేవుళ్ళాడతారుగాని, మావాడికి కూచోడానికి అసనంకూడా ఎందుకండీ ? నిక్షేపం అల్లా కిందేకూచుని రాసుగుంటాడూ !

158

భోగయ్య—(కోపంవచ్చి పెళ్ళాంతో) ఛీ ఛీ ! వారం రోజులుదాకా నాతో మాట్లాడకూ !

పె—తరవాత నాకు మళ్ళీతప్పదూ ?

ఘో—(మరీకోపంతో) ఛీ ఛీ ! నాతో అసలు మాట్లాడకూ.
పె—మాట్లాడకుండా కనిపిస్తూండం కావాలీ మళ్ళాను !
ఘో—(మండిపడి) అయితే ఏడు కూచుని !
పె—అప్పుడేనా ?

159

కాంభొట్లు—రామయ్యా ! మరోమాట చెప్పకు. పట్టు. గోవుతోపాటు ఒకరూపాయి చెక్క పేడంటిది దక్షణఇస్తారు !

రా—దక్షణ రూపాయికి తగ్గితే ఈ గోపుని ఛస్తే దానం పట్టను.

కాం—ఏం ?

రా—మాదిగాళ్ళు మనిషిఒక్కంటికి ప్రావలాయేనా పుచ్చుగుంటారుగదా, చేతొన్నెమ్మట్టుగోమన్నావుటోయ్ ?

160

తండ్రి—అబ్బాయి. మునెయ్యా ! నువ్వు క్లాసులో ఆఖరు వాడవు ఏమిటి ? ఈవాళ తెలిసిందీ !

ము—మరేట నాన్నా, కాని, నాతప్పు ఏమీలేదు.
తం—ఏం అల్లా ఎల్లా వచ్చిందీ ?
ము—తప్పంతా మాక్లాసులో రంగోజీఅనే కుర్రాడిది.
తం—వాడెంజేశాడూ ?

ము—చిన్నతనాన్నించీ మాబర్లోనే తగులడ్డ పీనుగు ఇప్పుడు సర్టిఫికట్టు పుచ్చేసుగుని లేచి చక్కాపోయాడు, అందుకని ఇల్లావచ్చింది.

161

ఒక ఇనస్పెక్టరు సెకండుఫారం కుర్రాళ్ళని పరీక్షచేస్తూ,

ఇ—రొండోవాడు! "లోకల్ ఫండు" అంటే ఏమిటి?

రొం—ఎక్కడా రాలేదండి.

ఇ—(మేష్టరుతో) ఈక్లాసులోకల్లా తెలివిగలవాణ్ణడగండి!

ఇ—నువ్ చెప్పు! ఒకటోవాడు?

ఒ—లోకుల దగ్గిర్నించి పోగుచేసిన డబ్బండి.

ఇ—ఓ మోస్తరుగా ఉంది. కాని, ఇంకా వీళ్ళకి లోకల్ నాలెడ్జి సరిగ్గాలేదయ్యా, మేష్టరు!

162

బెజవాడా బందరు రైలుగార్డు దోసపాడుదగ్గిర ఒక ముసలమ్మ అవస్థ ప్లాటుఫారంమీద చూసి జాలిపడి,

గా—ఏవూరెళ్ళాలి, ముసలమ్మా?

ము—బందరు.

గా—అట్టాయితే, పోనీ ఈరైలెక్కు, నడవలేవు.

ము—కోరటులో అర్జెంటుపనుంది బాబూ, నడిచేపోతా!

163

ఒకదొరసాని "మాజిక్ లాంతరు" లెక్చరుఇస్తూండగా, ఆవిడ తాలూకు గుమస్తా సందర్భానికి బొమ్మకనపరచడంలో,

దొరసాని—(సభవారితో) అదిగో, నేను నాటకంలో వేసిన వేషంబొమ్మ!

గుమాస్తా—(ఆబొమ్మ చూపించాడు)

దొ—అదుగో, నేను పట్నవాసంలో ఉన్నప్పుడు వేసుగునే వేషంబొమ్మ!

గు—(ఆబొమ్మ చూపించాడు)

దొ—అదిగో, నేను ఎడారిలో ఉన్నప్పుడు వేషం బొమ్మ!

గు—(గోచీలేని ఒకచంటిపిల్లాడిబొమ్మ చూపించాడు.)

164

ఒక మహాపట్టణంలో ఇరవై వేలకి భీమా వెయ్యదల్చుకుని వచ్చిన పెద్దమనిషితో,

భీమాకంపెనీ ఏజెంటు—దయచెయ్యండి. ఏం నిశ్చయించారు? యాభై వేలా, ఇరవై యేనా?

పె—ఇరవై యే.

ఏ—అయితే మీ కారు ఏం కారూ?

పె—నాకు కార్లేదండి, నడిచే పోతూంటాను.

ఏ—రోడ్లమీదకూడానా?

పె—ఆ. అయితేం?

ఏ—సరిసరి. అల్లాయితే ఇన్సూరెన్సు కుదరదండి. రోడ్ల మీదనడిచే పోతూండేవాళ్ళని ఇన్సూరు చేసుగుంటే మాకంపెనీ మట్టికొట్టుకుపోతుంది. దయచెయ్యండి.

165

నారాయణమూర్తి—నరసింహం! మనఊళ్ళో పెద్దసత్రం ఉంది చూశావ్?

న—ఆ. చెబుదూ!

నా—దానితాలూకు మురుగుకుండు ఉన్న వీధిని కలరా ఎప్పుడూ రాదు.

న—ఎంచేత?

నా—కుండులోఉన్న పురుగులు కలరాపురుగుల్ని తినేస్తాయి!

166

లచ్చన్న—ఏమోయ్, కనకయ్యా ! రాయుడికి పిల్లనివ్వాలని ఉంది. ఏమిటి నీఊహ ?

క—రాయుడికేనా ? రాజాలా ఉంది. ఇచ్చెయ్. వాడికి ఆయుర్దాయంకూడా పూర్తిగా ఉంటుంది.

ల—వాడి చక్రం వేసిచూశావా ఏమిటి ?

క—లేదు.

ల—లేకపోతే ఎల్లాతెలిసిందీ ?

క—తెలియక పోవడమేమిటీ ? వాడు పోస్టుశాఖవాడుగా !

ల—అయితే ?

క—వాడికి చావడానికి తీరుబడి ఉండదు.

167

ఏడేళ్ళవయస్సుగల బసవయ్య తండ్రిదగ్గిర డబ్బుఒకటిచూసి,

బ—నాన్నా ! ఏంనాన్నా, నాకు డబ్బెట్టి గాజులు వేయించవ్ ? చెల్లాయికిమల్లే ?

తం—ఇల్లూపొలమూ తగులడి పోనీరా, వెయిస్తానూ !

బ—(మూతిముడుగుని) అప్పుడు డబ్బుండదు నాన్నా !

168

ఇంగ్లీషులోంచి తెలుగులోకి తర్జుమాచెయ్యడం చెప్పే

మేష్టరు—"స్ట్రేంజర్" అంటే అర్థ మేమిటి తెలుగుని ? ముక్కయ్యా !

ము—"విదేశి."

మే—అంతబాగుండలేద్దు. "షరదేశి" అంటే దానికంటె సరిగ్గా ఉంటుంది.

అనగా వెనకాలకూర్చున్న మోహనరావు అడగండే.

మో—మేష్టారండి: మీరు చెప్పిందానికంటె మరొకటి మరీ జోరుగా ఉంటుందండి,

మే—ఏమిటి?

మో—"బహిర్ద్విశి"

169

ఒకతురక రైల్లో పోతూ, తనపక్కకూచున్నది ఒక బ్రాహ్మడని కనిపెట్టి.

తు—బొమ్మన్ జీ! హిందూస్తానీకా మాలుమ్?

అని అడగగా, బ్రాహ్మడు ప్రత్యుత్తరం చెప్పక, తెలిసినట్టు తలకాయి ఊపగా,

తు—కహాఁజాతే?

బ్రా—అబ్బో! ప్రజ్ఞ! మాలోనూ ఉంది, ఉత్తమే శిఖరే జాతే!

170

వెంకాజీ—వర్ధనమ్మగారూ! అయిందీ, మీ మనమరాలి వివాహం?

వ—ఏదో అషీషూ అయింది, నాయన! కన్నెచెర వొదిలింది.

వెం—సంతోషం. కట్నం ఏమాత్రం, లాంచనాలేమిటి?

వ—కట్నం లేదుగాని, పెళ్ళికొడుకు పెంకితనం చేస్తే, తరవాత, చేతికి కట్టుగోడానికిష ఓవిష్ణువాచీ కొని ఇస్తాం అన్నాం.

171

శివయ్య—బాపిరాజూ! మనఊరి డిస్ట్రిక్టుమునసబుగారు ఏం. ప్యాసయ్యాడురా పరిక్షలూ!ఆయనికి అన్నీ డిగ్రీలే. వాటికి లెక్కాపత్రం లేదు.

బా—ఇవేంచూశావు? వీళ్ళ అన్నది సొమ్మో!

శి—ఆయన కెన్ని ఉన్నాయి?

బా—మూడువందలఅరవై సరిగ్గా.

172

కోదండం—బలరామా! విన్నావా? చలమప్పసెట్టి ఇనసాలమెంటు ఎక్కాడట! పెళ్ళాం లేవడం లేదుట!

బ—పాపం! విచారం గావును.

కో—కాదుట! నగలు మొయ్యలేక.

173

కొత్తగా గర్భాధానంఅయిన సింహేశ్వరరావు తమయింటి హాలులో కూర్చుని ఉండగా, అతని స్నేహితుడు కమలయ్య దవడ చేత్తోపట్టుగుని ప్రవేశించగా,

సిం—అదేమిటోయ్?

క—(మూలుగుతూ) పల్లుతీపూ! ఇది ఎల్లాపోవడం?

సిం—ఓస్! ఇంతేగద! నేనోటి చెప్తాను గప్చిప్గా చేసి పారెయ్! నేనూ ఇల్లానే ఈమధ్య బాధపడ్డాను. కాని, నా పెళ్ళాన్ని ముద్దుపెట్టుగునేసరికి బాధ ఎక్కడి దక్కడ ఎగిరి చక్కాపోయింది!

క—(మూలుగుతూనే) సరే అల్లాయితే తప్పుతుందీ నువ్ చెప్పింతరవాత! ఓమాటు ఆవిణ్ణి మరి ఇల్లారమ్మనూ!

174

ఒక భారీ ఆడమనిషి దొంగని పట్టుగున్న కేసు విచారిస్తూ.

జడ్జి—మీరేనండి, దొంగని పడతా ?

ఆవిడ—చిత్తం !

జ—మిరేనా అతణ్ణి కొడతా ?

ఆ—కొట్టడంలో మళ్ళీ ఓమోస్తరుగా కాదండి. చెంపలు వాయగొట్టి, బుగ్గలు రక్కి, ఒళ్ళుకొరికి వొదిలిపెట్టాను.

జ—మంచిపని చేశారు. కళ్ళుకుడా పీకి పళ్ళుకుడా రాలగొట్ట వలసింది, తీరిపోను !

ఆ—అంతపనీ జరిగేదేనండి కాస్తయితే ! కాని నేను మా ఆయనేమో అని భ్రమించి చాలాసేపు సందేహించి ఊరు కున్నాను.

175

నారయ్య—సత్యం ! వెంకట్రామారావు వరసని ఫేలవు తున్నాడు యం. యే. ఏమిటి కారణం ? వ్యాకరణంతప్పా ? వర్ణక్రమంతప్పా ? భావాలుతప్పా ?

స—నా ఉద్దేశం ఇవేంకాదురా ! ఈయన చచ్చినన్ని పుస్త కాలు చదివాడు. ఇవన్నీ దిద్దేవాడికి బోధపడక ఈన్ని ఫేలం టున్నాడు.

నా—ఈ మాటు ఇక ఫేలు అవడేమోలే !

స—ఏం ?

నా—ఈమాటు పేపరిచ్చే ఆయనా నాలుగుసార్లు గంట వాయించినవాడేట !

176

తిరుమలదాసు—రేపు ఆఫీసరొస్తాడు, తప్పకుండా రావాలిస్మీ మంగలీ! సూర్యోదయం కాకుండా వచ్చేసెయ్యాలి.

మంగలి—సిత్తంబాబు.

తి—విధాయకంగా రారోయ్. ఏం?

మం—వత్తానుబాబు.

తి—మరిచిపోతావా ?

మం—మరిచిపోనుగాని బాబూ, పోనీ సాయింతరం కసేరీ నించి వచ్చేతప్పుడు తమరు గెడ్డం నాకిచ్చి యెల్లండిబాబూ. అద్దంనాగ సవరంసేసి ఉంచుతాను. ఉదయాన్నే తగిలించుకు సక్కా యెల్దురుగాని!

177

రాజశేఖరం—ఇందాకణ్ణించి వెతుకుతున్నాను, "చిత్రనళీయం" కనిపించదు!

చంద్రశేఖరం—(పరధ్యానంగా) ఏమిటిరా వెతుకుతూంటా;

రా—ఏడ్చినట్టేవుంది. "చిత్రనళీయం" అని చెప్పలేదుట్రా? కొత్తగాకొన్నది!

చం—చెబుతున్నావ్ గాని. ఓ పనిచెయ్. "హరిశ్చంద్ర" వెతుకు. తక్షణం "చిత్రనళీయం" కనిపిస్తుంది.

రా—ఏం? ఎల్లా చెప్పగలవ్ ?

చం—ఏదేనాఒకటి ఉండదేమో అనుకుంటూ మనం దాని కోసం వెతిగితే, ఆ ఒకటీతప్ప కడంవిఅన్నీ కంటికి కనపడతాయి,

178

అయిదోక్లాసు చదుపుతూన్న రామన్న తండ్రితో,

రా—మన తలుపుమీద 2/6 అని ఉందేమిటినాన్నా ?

తం—అదా ? మన ఇంటి నెంబరు.

రా—ఇది వేసేవాళ్ళకి లెక్కల్లో సున్నావస్తుంది నాన్నా.

తం—ఏం ?

రా—ఆ భిన్నాంకంలో రెండు "కామను" కొట్టేసి 1/3 అని వెయ్యాలి నానా !

170

రాఘవులు—రమణారావూ ! సోమన్న ఈ వ్యాపారం ఇల్లా తగలేశాడేమిటీ ! తనా హైరానపడ్డాడు. మనకా చిక్కులు. అందరికీ తగులుబాటైంది. వీడు వొట్టి వైదీకిలా కనబడు తున్నాడు.

రా—వైదీకైనా బాగానే ఉండును. నా ఉద్దేశంలో వీడు కేవలం జడ్దీకి.

180

సీతానాగయ్య—ముత్యాలూ ! ఇదిట్రా చేసినపనీ ! ఆఉత్తరం సోమేశ్వరమ్మగారికి ఇమ్మంటే సోమేశ్వరయ్యగారికి ఇచ్చావ్ ; వెట్టిముండావాడులా ఉన్నావెక్కడోను !

ము—నెనెనెనేను వెవెవెవెట్టోణ్ణి కానండిబాబు, ననన సత్తోణ్ణండి.

181

జగన్నాధం—అప్పాజీ ! భోజనమెక్కడోయ్ యీపూటా ?

అ—మన ఘంటావారి సత్రంలో.

జ—అయితేనూ. అక్కడెంతమందవుతారుపూటకీ ?

అ—చాలామందవుతారు.

క—అయిదారుకుంచాలు వారతాయీ ?

అ—లెక్కేమిటి ? అయిదారువేల బియ్యంపైగా ఉడుకుతాయి.

182

గురవయ్య—ఉయేయి ! రాయప్పా ? నిన్నపొద్దున్న వస్తానని రాలేదేం ?

రా—విరోచనాలకి మందుపుచ్చుగున్నాను.

గు—అయితే రెండు వారాలు తిరగలేదుకదా .మొన్న పుచ్చుగుని, మళ్ళీ ఎందుకూ నిన్నా ?

రా—అప్పుడా ! అప్పుడు రుగ్మతగా ఉండడంవల్ల !

గు—ఇప్పుడు ?

రా—ఇప్పుడా ! మన్లోమననమాట. రేపు భోజనానికి వెళ్ళాలి కాట్టోయ్ మరీ !

183

గంగాధరం—ఒరేయ్, అప్పారావ్ ! మన శివరామమూర్తి ఉన్నాడేం ? వాడు ఊరికే బుజాలు సర్దుకుంటూంటా డేమిటి ? నిమిషానికోసారి ?

అ—నువ్వు కనిపెట్టలా ? పాపం వాడికి భుజంమీద షర్టు చిరుగూ కోటుచిరుగూ ఏకీభవించాయి. చర్మం కనిపించకుండా కమ్మడానికి వాడియత్నం.

గం—చిరుగుని ఆక్షేపణా ?

అ—అబ్బే కమ్మడాన్కి.

184

పంతులు—"వర్షాలు"—దీనికి ఇంగ్లీషేమిటి? పాపయ్యా!
పా—రెయిన్సండి.
పం—"అకాలపు వర్షాలు"—దీనికి? బాపయ్యా!
బా—అకాలీరెయిన్సండి.

185

కొండన్న—మామేష్టరు గడ్డముందే, అది ఇనపరవ్వలాగ ఉంటుంది. అచ్చంగా, "అయిరన్ ఫైలింగ్సే"

రెడ్డి—అల్లాఅయితే, డబ్బిచ్చుగుని క్షౌరం చెయించుగుంటాడెందుకూ ఆయనా?

కొం—ఏంజెయ్యమన్నావ్? కనపడ్డవాడల్లా "ఫీల్" అవుతుంటేనే!

రె—అదికాదోయ్! అయస్కాంతం అనగా "మేగ్నెట్" తగిలిస్తే పని జరగదుటోయ్?

186

విస్సప్ప—గోకర్ణంగారూ! ఎప్పుడొచ్చారండీ పట్నవనించీ? ఈవాళ మెయిల్లోనా? "ఎలిమెంటరీమేథమేటిక్సు" లో నా మార్కులు కనుక్కొచ్చారూ?

గో—వీల్లేకపోయిందోయ్.

వి—పోనీ 'కైట్' దొరగార్ని చూస్తాం అన్నారు. చూశారా?

గో—ఆ.

వి—పోన్లెండి, ఎక్కడికక్కడికే. వారివర్ణనం ఎవరుచెయ్యించారు?

గో—మన "శేషూఅయ్యరు" గారు!

వి—అల్లాష్టండీ? అయితేనూ శేషూఅయ్యరు పార్టు వన్నా పార్టుటూఅ? మిమ్మల్ని దొరదగ్గిరికి తీసిగెళ్ళింది?

187

ముకుందం—కాంతయ్యా! ఆదెయ్యకి ఎన్నేళ్లుంటాయి?

కాం—అధిక మాసాలు మినహాయింపునూటపదహార్లు.

ము—వాడు ఇంకా పోలేదేంకర్మం?

కాం—వీడు పుట్టినవేళ చిత్రగుప్తుడికి స్మారకం లేదేమో. అంచేత లెక్కల్లో రాసుగోడం పడలేదుగావును.

ము—అదే నిజమైతే వీడు ఇహ పోడేమో, వీడి ఘొహం మండా?

కాం—అల్లాఅయితే, చిత్రగుప్తుడికి ఆకాశరామన్న అర్జీ పారెయ్యాలి.

188

ఆచార్యుల్లుగారూ నాగరత్తమ్మగారూ కలిసి పాటకచేరీ చెయ్యడం సంభవించగా.

ఆ—(నాగరత్తమ్మ పాడుతూండగా) ఓహోహో! ఏం పాట అహోహో! ఒస్సి! అబ్బోబ్బో!....

నా—(ఆచార్లుగారు పాడగా) మీపాట నా వగ్గర్నించి అంత శ్లాఘ లాక్కోలేకపోయిందిగదా!

ఆ—అవునుమరి పాపం! వెఱ్ఱిమాటగాని, సుప్వ నాకుమల్లే అబద్ధం ఆడగలవా?

189

ఒక బ్రాహ్మడూ ఒకశూద్రుడూ దొంగతనం జాయింటుగా చేసి పట్టుబడిన ఒకకేసు జడ్జీమొదటికి తేబడగా.

జ—ముందే కూడబలుక్కుని వెళ్ళినబాపతేమిటి ? వేసి పోతే, ప్రత్యేకప్రయత్నంలో కలుసుగున్నదా ?

హూ—నాకేమీ తెలియదండి.

జ—వాల్లేస్తూ మాట్టాడొచ్చావ్ పైగానూ ! స్థలం సందర్భం లేదునీకూ ? ప్రతీచోటా అవతలవాడితో పోటీయేనా నీకు ?

హూ—నాకేమీ తెలియదండి.

జ—ఛీ ఇక్కడ నీకు జాగాలేదు. అథమం ఇక్కడేనా ఆపోటీ మట్టం చెయ్యాలి. అవతలికినడు. పో, తక్షణం !

190

పుల్లయ్య తనుచేస్తూన్న భూమికిభామందులైన అప్పారావు గారితో మాట్లాడుతూ.

పు—ఏమండీ. అప్పారాయలగారూ ! మరి తమరు ఎక్కడ లేనిడబ్బూ పోసి బోలెడంతశాస్త్రం చదివారుగందా ! అద్దాలు అవీ సూస్తారుగందా ! నచ్చిత్రాల్ని పిలుస్తారు గందా ! మా మంగలోడి అద్దంలో నెమిలి కనిపిస్తుందీ, అదేటి చెప్పండి!

అ—హోరినీముండామొయ్యా, అదిటోయ్ ? దుర్భిణీలద్దం గాబోలు : క్షౌరం తరవాత చూసుకో, నెమిలి అప్పుడు కనిపించదు.

191

సుబ్రహ్మణ్యం—ఏరా, అచ్యుతరామయ్యా ! అయిందీ "కాంపిటిషను ?"

అ—ఆ.

సు—ఎన్ని తినవలిసిన మిఠాయి ఉండలు ?

అ—పెద్దరకం. నలభై.

సు—'ప్రైజు' నీదేనా ?

అ—ఆ.

సు—ఎంత ?

అ—రూపాయిన్నర.

సు—అదేమిటి ? అల్లా పెట్టారేం ?

అ—బండిఛార్జి ఓ అర్థనుకో, డాక్టరు రూపాయి తక్కువకి మాట్టాడతాడామరి !

192

సీతయ్య—ఎక్కడికిరా, బయల్దేరావ్ ?

సూరప్ప—చెప్పనా ?

సీ—కానీ.

సూ—సురభినాటకానికి.

సీ—ఏం తొందర ?

సూ—ఈవాళమరి ఆఖరాటకాదూ ?

సీ—కూచోవోయ్, రేపెళ్ళచ్చూ !

సూ—నీ కంతా వేళాకోళంగాఉంది !

సీ—కాదురా ! "ఆఖరాట" అనేది ఉందే అది బహువచనం.

193

గోవిందు—ఏంరా చిదంబరం ? పెద్దకాలేజీలో నీళ్ళ బ్రాహ్మడు ....

చి—ఊఁ.

గో—మంచినీళ్ళడిగితే కరుస్తాడుటేమిటి మనుషుల్ని ?

చి—ఎవర్రా అంటా? నేనమ్మను.

గో—ఏం?

చి—నువ్వా నమ్మవు, ఆ మాటకొస్తే.

గో—ఏం?

చి—లక్కపిడతకాదుర్రా, ఆయన నోరూ!

194

బాపిరాజు తమఊళ్ళోనే వేరేబసలో కాపరంఉన్న తన మేనత్తని చూడ్డానికెళ్ళి మాటామంతీ అయేసరికి పొద్దుపోయి అక్కడే మడిగట్టుకుని భోజనం చేస్తూ.

బా—అత్తా! తలవెంట్రుకొచ్చిందమ్మా!

అ—నాఇంట్లోకి ఎల్లావొచ్చిందిరా, నాయనా! అఘీరిస్తా నుండు.

195

ఒక బోధనకాలేజీలో బోధించడం నేర్చుగుంటూన్న ఒక తయారీమేష్టరు ఒకసారి తప్పనిసరి భోక్తవ్యంతగిలి "స్కూలు ఫైనలు" పరిక్షని మూడేసిమాట్లు గుంజిచూసిన విద్యార్థుల క్లాసుకి వెళ్ళి, చరిత్రపాఠం చెప్పబోగా, క్లాసులో ఒకరైన,

వరహాలరావు—ఏమండీ, ట్రైనింగు మేష్టారూ! మీరు బి. యే. రొండు "సబ్జెక్టూ" ఓమాటే ప్యాసయారా, లేక అప సవ్యం ఏమన్నా జరిగిందా?

మే—(కోపంగా) నాన్సెన్స్, షటప్, అనవసరంగా ప్రస్తాపించకు,

వ—తగ్గాలి తగ్గాలి, ధోరణి ఘోరుగా ఉందండోయ్ మీవంటి వాళ్ళని లక్షమందిని చూశాను.

మే—"సిడౌన్." ఇది మొదటి "వార్నింగ్" జాగ్రత్త.

వ—సరేగానండి, మొన్నసందులోమిమ్మల్ని పిండికొంచ కొట్టడం....

మే—జాగ్రత్త.

వ—కోపంవద్దు సార్. ఇందాకా "మొదటి" అన్నారు. గనక ఇంకా రెండు మూడు వార్నింగు ఛాన్సులు ఉంటా యనుకున్నా!

మే—ఎన్నిఛాన్సులు చూసినా ఏమీ లాభంలేదు.

196

రమణప్ప—కోరటులో మంచినీళ్ళ బ్రాహ్మడిపని కాశీ వచ్చిందిట.

కాశీ—నువ్వెరగవోయ్, కొత్తవాణ్ణి వేశారట!

ర—ఎవర్ని?

కా—ఒకఅప్పలస్వామిని,

197

పల్లెటూరినుంచి వెళ్ళి పట్నవాసంలో తనస్నేహితుడు నాగేంద్రుడు కలిసి నాటకంచూస్తూన్నా,

శివన్నావధాన్లు—నాగేంద్రుడూ! ఈనారదుడువేషం వేసిన వాళ్ళూ వాళ్ళూనూ, ప్రత్యేకం ఇందుకోసం ముందునించీ గడ్డాలు పెంచుగు అట్టే పెట్టుగుంటూరా ఏమిటి?

నా—అక్కర్లేదు. గడ్డాలుంటాయి,

శి—ఇందాకా మనం వస్తూంటే పొడుచ్చుగు మంగళ్ళు లోపలి కెందుకూ వెడుతున్నారూ?

నా—పొద్దున్నే వీళ్లేనివాళ్ళు క్షౌరాలుచెయించుగోడానికి.

శి—అదికాదోయ్! క్షౌరంచేసినగడ్డాలు పెట్టుగుని బరిమీదికి రాకూడదూ?

198

తండ్రి—అబ్బాయి! వెంకటేశ్వర్లూ! మీపరిక్ష దరఖాస్తులు ఎప్పుడ్రా?

వెం—ఈవాళే.

తం—నువ్వు కట్టేశావా, పరిక్షకి?

వెం—హెడ్డుమేష్టరుగారు పెట్టించలేదు. నాన్నా.

తం—ఏడిసినట్టేఉంది. రూపాయలిచ్చేవాణ్ణి నేను ఇక్కడుంటూంటే ఆయనెవడ్రా కట్టించడానికీ?

వెం—ఏమో నాన్నా. ఇప్పుడేంచెయ్యనూ?

తం—పందిరిమంచం సొరుగులో రూపాయిలు దాచాను, అవి చప్పుడుచెయ్యకుండా తీసి రొండోకంటివా డెరక్కుండా కట్టేసి రా, తరువాత చూసుగోవచ్చూ!

199

ఒక గొప్పవాడు గంభీరోపన్యాసం ఇస్తూ, ఒక సందర్భంలో,

గొ—"ఒకదొరసాని నిద్రచెంది, కలగాంచి, ఆ కలలో తాను తన భర్తను ఎడబాయవలసి వచ్చుటయు, అందువలన భర్త గతించెనను సంగతి తనకు తెలియవచ్చుటయు, అందుచే తానును మరణించుటయు జగిరినట్లు చూసి, ఆమె తక్షణమే నిజముగ చనిపోయెనట."

ఒక సభ్యుడు—ఏమి ఆశ్చర్యం! ఏకాశ్చర్యం!

గో—ఏది అది?

ఒక సభ్యుడు—ఆ కల మీకు తెలియడమే! ఆశ్చర్యం!

200

శేషు—వి. యస్. మన్యం ఫొటోలు తీస్తున్నాట్ట! ఏమన్నా బాగుంటూన్నట్టేనా? బాబూ?

బా—బాగానే ఉంటున్నాయి. కాని, మొన్న నా ఫొటో తీశాడూ! ఆ తీసినపలకకి ఈశాన్యమూలమాత్ర నా రొండు కాళ్ళూ పడ్డాయి!

శే—నీ మొహంలా ఉంది!

బా—అదిలేందే, అందులో!

201

రైలులో ఫస్టుక్లాసుబండీలో ఒకడు దిక్కుమాలి కంపుకొట్టే చుట్ట తాగుతూ నానాఅల్లరీ చేస్తూండడం చూసి వాడికి ఎల్లానేనా ఉద్వాసన చెప్పాలని కడంవాళ్ళు యత్నిస్తూంటే, అందులో ఉన్న పెంటోజీ కిటికీలోంచి బయటికి తలకాయపెట్టి చూసి,

పెం—గార్డ్! ఈ మనిషి మూడోక్లాసు టిక్కట్టుతో ఫస్టు క్లాసులో ఎక్కాడు.

అని కేక వేసేసరికి ఎవడోవచ్చి వాణ్ణి సాగదోలగా, తక్కిన వాళ్ళలో ఒకడు పెంటోజీతో,

—ఎల్లా కనిపెట్టారు మీరిదీ?

పెం—నా టిక్కట్టు రంగునుబట్టి.

202

రామన్న—పిచ్చెయ్యా! కనకదాసుగారు బాగున్నారూ?

పి—ఆ. నిక్షేపంలా ఉన్నాడు. ఏం?

రా—అహఁ. మరో పూటవిన్నాన్లే, నేను.

పి—పనుందా?

రా—మరేలే, వేరే మాట్టాడవలిసిన పనుంది. ఇంట్లో ఉంటాడా ఇప్పుడు?

పి—బహుశా ఈపాటికి పైకివెళ్ళుంటాడు! లాభంలేదు.

203

పంతులు—నారప్పా! ఎంచేత ఆలస్యంగావచ్చావ్?

నా—నాన్న ఉండిపొమ్మన్నాడండి.

పం—సరే క్షమాపణకోరుతూ ఉత్తరంపట్టా ఆయనగారి దగ్గిర్నుంచి!

నా—నాన్న క్షమాపణ్లుకోరే రకంకాదండి.

పం—ఏం కథ?

నా—అల్లాగనక ప్రారంభిస్తే అమ్మ, గరిటె కాలేస్తుందండి.

204

లింగప్ప—ఏమండీ! నాటకంటిక్కెట్లు ఎవరుఅమ్ముతూంటా?

గుమాస్తా—ఏం? నేనే, ఏంకావాలి?

లిం—నాటకపుపేపరు ఓటిల్లా ఇవ్వండి.

గు—ఇక్కడుండవు.

లిం—అయితే. అర్ధచార్జీలు ఎవరెవరికి?

గు—చదువుకునే పిల్లలికి.

లిం—నాకు ఎడంకంటో పువ్వుగదామరి, నేసుకుడా పూర్తి రేటు తగలేసుకోవలిసిందే చూస్తాను !

గు—ఆ. చెముడు లేదుగా ?

లిం—లేకపోతేమాత్రం ! ఓపాతికేనా కొట్టెయ్యరూ ?

205

రఘురాంగారు తనకి కావలసినవాడైన పంకజాన్ని లెక్కల పరిక్షనాడు కలుసుగుని,

ర—పంకజం ! లెక్కలు ఎన్నిచేసినట్టు ? అంతే రైట్టుగా !

పం—ప్రతీప్రశ్నా వ్రాత్తి తప్పులకుప్ప అవుతూంటే, చెయ్యడం కుర్రాడి తరంటండీ ? వాడి తాతతరమా !

ర—ఓరి ! ఇప్పటికుర్రాళ్ళది ఏమి మేధస్సురా ? నువ్వు అందులో తప్పులుకుడా ఎంచావ్ ?

పం—ఓ. ఓ లెక్కలో–"రెండువరసమైలురాళ్ళదగ్గరనుండి" అంటూఉంది. అందులో గొప్పతప్పు !

ర—ఏమిటదీ ?

పం—తప్పంటే మరేంలేదు, ఒకదారుణమైన లోటు !

ర—అదేఆయిరి. ఏమిటి ?

పం—ఆమైలురాళ్ళ మధ్యదూరం ఇవ్వడం మరిచి పోయాడు

ర—సరే. అదోటి. కడంవి ?

పం—కడంవీ ఇదేరకంగదా అని ఊహించి మానేశాను. అన్నం అంతాచూడాలి !

206

కామన్న—సుబ్బయ్యబాబూ! మీఅవుసంగతి ఎల్లా ఉన్నట్టు?

సు—అసలు ఆపుతో అహార్నిశాలూ హైరాన పడేకంటె, విస్తరిదగ్గిర ఓ రాగంపెట్టి లేస్తేనయం. ఏం చెప్పనూ!

కా—దొడ్లోగుంజకి కట్టేసిలేదేం? బీటికి తోవేరా తెంపుగు పోయిందా?.

సు—ఎరగవ్ నాయనా? ఈ తపాలికి తోలిపెడితేనే!

కా—ఎవరికీ?

సు—ఓ ధర్మరాజుకి.

కా—మంచివాడేనా?

సు—అల్లాంటివాడు భూమిమీద లేడు.

207

తీర్థం రొండోనాడు చేస్లూ పరబ్రహ్మం కలుసుకోగా,

చే—నిన్నరాత్రి మళ్ళీ కనిపించలేదేంరా, నువ్వూ?

ప—పైగానా? ఆ రథందగ్గిర ఇట్టే మాయం అయావు! నాకెక్కడా పడక్కి స్థలం కుదరక నాటకాని కెళ్ళాను.

చే—"వరవిక్రయా"నికేనా? "చింతామణి"కా?

ప—చింతామణికే,

చే—"చింతామణి" ఎవరు?

ప—మాణిక్యంట.

చే—స్త్రీ ఆ?

ప—నాపక్కని కూచుని నాటకం చూస్తూన్న మంగల్ని ప్రతీ అంకంచివరా లోపలికి ఈడ్చుకుపోయారు మరి.

208

సుబ్బన్న—హరిదాసుగారూ! మీరు కథ చెప్పేటప్పుడు పాలు వగైరా పుచ్చుగోడం కద్దా?

హ—పుచ్చుగోకపోడంకుడానా! ఏడిసినట్టేఉంది.

సు—కథ మొదలెట్టిన ఎంతసేపట్లో పుచ్చుగుంటూంటారు?

హ—ఎంతసేపా? తోడుతూనే.

సు—ఏం? అంతతొందరేం దేవరవారికీ?

హ—నీకేంతెలుసూ! ఈశాన్యమూల చేటంత మబ్బట్టి, కొండ కుండల్లాఅయి, క్షోణీపాతంగా వర్షం కురిసి, అసలు కథే ఆగిపోవచ్చు. ఆతరవాత నాకథ ఎవడిక్కావాలి?

సు—అహఁ, వర్షాకాలం కానప్పుడు?

హ—అప్పుడూ మరోటి ఏదోరావచ్చు.

సు—మరోటి ఏదో రాకుండా ఉంటేమాటే!

హ—ఏమో! వెధవ యక్షప్రశ్నలు. ఇదివరకెప్పుడూ ఏదోవోటి వస్తూనేఉంది.

209

"ఫుట్‌బాల్" ఆటలో మధ్యవర్తిగా పనిచేస్తూన్న బ్రహ్మయ్య గారిని ప్రేక్షకుల్లో ఒకకుర్రవాడు రాయిపుచ్చుగుని చచ్చేటట్టు వెయ్యగా, బ్రహ్మయ్య, పక్కనున్న ఒక పెద్దమనిషిని సంబోధించి,

బ్ర—చూశారండీ, సార్, ఈ కుర్రపిశాచంగాడు నామొహం మీద ఎంతగాయం చేశాడో?

పె—(అయన్ని సమదాయిస్తూ) తొందరపడకండి, బాబూ ఆ పిల్లకాయకి బంతిఆటరూల్సు తెలియవేమో. కర్మదశా!

210

నరసింహమూర్తి, తనకి కొత్తగా పరిచితుడైన సత్యనారాయణ ఇంట్లో భోజనంచేస్తూ, కొంత అర్థంలేని సంభాషణ చేసిచేసి,

స—ఏమండీ! మీ "వైఫ్"గారు చాల "బ్యూటిఫుల్" గా ఉంటారండీ, ఏమిటో అనుకున్నానూ!

స—అందుకనేనండి మిమ్మల్నీ మీబోట్లనీ పిలుస్తూంటాను నాయింటికి,

న—ఏం?

స—అనుమానంఅనేది నా మనస్సులో జనించడం అసంభవం అవడానికి.

211

మగపెళ్ళివారి తాలూకు లక్ష్మణరావు, విడిదిలో భోగంమేళం మేజువాణీ జరుగుతూన్న సందర్భంలో పెళ్ళివారింటికి పరిగెట్టి అక్కడ తన స్నేహితుడైన కామప్పతో,

ల—కామప్పగారూ! మేళానికి రావాలి మహజోరుగాఉంది.

కా—నన్ను చంపకు, ఎందుకొచ్చిన మేళం!

ల—పోనీ వాళ్ళతో ఒక్కమాటచెప్పి చక్కావస్తురుగాని!

కా—ఏమోబాబూ! నేను మళ్ళీమళ్ళీ నాలిక ఇస్త్రీచెయించుగోలేను.

ల—అదేంకర్మం!

కా—అప్పటితో వాక్శుద్ధి పోతుంది, మరి.

ల—పోనీ వాళ్ళ గాంధర్వం విని చక్కావద్దురుగాని!

కా—ఏమోబాబూ! నేను మళ్ళీమళ్ళీ చెవులు కళాయి చెయించుగోలేను.

ల—అదేంకర్మం?

కా—అప్పటితో శ్రుతిజ్ఞానం చస్తుంది, మరి.

ల—పోనీ వాళ్ళనిచూసి చక్కారావయ్యా!

కా—ఏమోబాబూ! నేను మళ్ళీమళ్ళీ కళ్ళ మెరుగు పెట్టించు గోలేను,

ల—అదేం గ్రహచారం?

కా—అప్పటితో స్త్రీవాంఛ హరాయించిపోతేనూ!

212

డంగూరావుగారు ఒక సైన్యంలో జేరడానికి వెళ్ళి, అక్కడ పెద్దసేనానితో మాట్లాడుతూండగా,

సే—అనుభవం ఏమన్నా సంపాదించావూ?

డం—చిత్తం.

సే—సరే. నీకు సేన ఉందీఅనుకో.

డం—నిజంగానేకదండీ! సరే.

సే—నాలుగు వేపుల్నుంచీ శత్రుసేనలొచ్చి పడుతున్నాయీ అనుకో. నీపై సుబేదారుదాక్షిణ్యం అంటాడనుకో, మీ సేనలు ఉత్తం అంటారనుకో, నీకు తూర్పు మొహంగా తిరగాలనిఉందీ అనుకో.

డం—నే అనుకోనండి

సే—కబడ్దార్! అనుకో! అప్పుడేం జేస్తావ్?

డం—చిత్తం! రాజీనామా దాఖలుచేస్తాను.

213

వెంకటానందం—మరిటా, ఒక ఆసామీటా, జైలు తణికీ చెయ్యటానికి ఇట్టేవెళ్లి, ఓ అరగంటలో బయటికి రావాలను కున్నాట్ట.

కోదండం——అనుకుంటే ?

వెం——పాపం ఆర్నెల్లు ఆలస్యం అయిపోయిందిట.

కో——అంతాలస్య మెందుకైందో ?

వెం——వాడు వెళ్ళిన దారివల్ల వచ్చింది ప్రమాదం.

కోం——ఏం ?

వెం——సింహద్వారంఅంట వెడితే తీరిపోనా ! కన్నంలోంచి వెళ్ళాట్ట !

214

బుచ్చన్న——రాంగారు ! మాఆవిడబొమ్మ పూర్తిచేశారూ ?

రాం——అయిందండి, రేపిస్తా.

బు——రంగులు ఎం ఉపయోగించారు ?

రాం——చీరకి పసుపూ, రైకకి ఊదా వేశా.

బు——చీ ఛీ. కారపురంగు చీరా మిరియపురంగు రవికా ఉండాలి.

రాం——ఏమిటండీ, తెలియకుండా మాట్టాడతారూ ?

బు——తెలియక పోవడమా ! ఆకారానికీ తత్వానికీ ఆమాత్ర మేనా సంబంధం లేకపోతే మా ఆవిడ బొమ్మే అనిపించదూ ! చాలుగాని, ఈపాటి రంగు ఫిరాయించండి.

215

మొగభార్య——నాతో ఏవేనా మాటలు తగులడాలీ అంటే, ఒంటరిగా ఉన్నప్పుడు తగులడక, నలుగురూ వచ్చినప్పుడు తగులడతారేం ? మీతగులడ్డం మండిపోతే !

ఆడంగిభర్త——సాక్ష్యానికి మనుషులు లేందే నీతో మాట్లాడ్డం ప్రమాదకరం అని లోగడ గ్రహించాగా !

216

రాజయ్య—పానకాలూ! డిక్షనరీ అమ్ముతున్నాను కొంటా వాయేమిటి?

పా—ఎవరిది?

రా—నాదే.

పా—సరేలే. చేసిందెవరూ?

రా—బ్రౌను.

పా—గొప్పదే. ఎంచేత అమ్ముతున్నావ్?

రా—ఏమాట తీసిచూసినా నావర్ణక్రమం ఒక్కచోటా కనపట్టంలేదు.

పా—అసలతను దొరగనక నా వర్ణక్రమమాత్రం కనపడి ఏడుస్తుందామిటి! నాకూవద్దా!

217

భొట్లు—ఏమోయ్ యాజు! చమత్కారంగా మాట్టాడినా కొందరు కొందరు నవ్వరేం!

యా—నువ్వు మాట్టాడినప్పుడేనా?

భొ—మరే,

యా—అల్లా టప్పుడు నువ్వు వాళ్ళసమక్షమందే ఉంటావు గనక చక్కలిగిల్లేనా పెట్టు, అరికాళ్ళేనా గోకు. కడుపుబ్బి పోతారు.

218

జడ్జీగారి ఎదట,

1వ ప్లీడరు—అవతలపార్టీ వకీలు బలే క్షుద్రమనిషీనూ, ఉపద్రవమైన ఋచ్చానండి. లేకపోతేనా?

2వ ప్లీడరు—అవతల నాసోదరుడు ఫస్టుక్లాసు రాయడూ నూ వార్ధి భటాచోరూనండి. లేకపోతేనా!

జడ్జీ—సరే! ఇక్కడ వాదించవలసినది మీమాంసరేకాని సిద్ధాంతాలుకాదని జ్ఞాపకం ఉంచుగోండి.

219

ఒక కంపెనీ ఏజంటు, తను రైలు ప్రయాణీకులకి అమ్మ తెచ్చిన ఒక ఔషధం ప్రకటనకోసం కొనియాడుతూ ఎక్చరు పూర్వకంగా,

ఏ—(ఒకడబ్బీ చూపిస్తూ) అయ్యా! ఇది రోజుకు నాలుగు వేలు ఖర్చు. కురుపులకు ఇది వజ్రాయిుధము. ఇది రాసినచో, కురుపులు పూటలో వింతగా తుప్పురాలినట్టు రాలిపోవును. దీని పేరు 'వింత.' డబ్బీ ఒక పావలా, ఒక డబ్బీకొనువారు వెంటనే పది కొందురు.

రైల్లోఒకరు—దీనివల్ల కురుపులు ఎక్కువవ్వుగదా! కొంప తవ్వి.

220

ఒకరైల్లో సెకండుక్లాసు పెట్టెలో రెండుసీట్లు కాళీగా ఉన్న ప్పుడు రంగారావుగారు ఎక్కి ఒకదాన్లో సామానుపెట్టి రెండో దాన్లోకి తను, సర్దుకుంటూండగానే అందులోకి · ముచ్చటకోసం పెద్దటిక్కట్టుకొనుక్కున్న రాజన్న ప్రవేశించి పగలైనాసరే మరతిప్పి లైట్లువెయ్యగా,

రం—ఇందులో ఖాళీలేదండి.

రా—ఆ మూట ఎవరిదీ?

రం—నాది గాదు, ఎవరో ఇక్కడెట్టి అల్లా వెళ్ళారు.

రా—నే యిస్తాలెండి.

అని మూటతీసి, తనుకూచుని మూట వాళ్ళో పెట్టుగున్న క్షణంలోనేర్రైలుకదలడంచూసి అతడు మూటఅవతలికి గిరవ టేయగా,

రం—అదేంపని!

రా—అవతలాయనకి పాపం మూటనష్టంకూడా ఎందుకనీ!

221

సూరపరాజు—చూశారూ! చిక్కొచ్చిపడ్డది. మా ఇద్దరమ్మాయిలకీ వివాహాలు, పెళ్ళికొడుకులికి పట్టుతాపితాలు కొనాలి. రెండూ ఒకటేతూనికా, ఒకటేరంగూ, ఒకటేసైజూ, ఒకటే ఖరీదూ ఉండితీరాలి.

గిరీశం—వారబొత్తిగా ఉండకూడదేం!

సూ—ఉంటే కుస్తీలు జరిగిపోతాయి మగపెళ్ళివార్లల్లో. అదీచిక్కు. ఏమిటి సాధనం!

గి—డామిట్! ఇదాచిక్కూ! ముందు ఒకటి కొనండి.

సూ—కొంటే ఏమైనట్టూ?

గి—ఎవ్వరూచూడకుండా దాన్ని రెండెట్టి గుడించండి. "వెరీ సింపిల్, యూ కెన్ వర్కౌట్ ఎట్ హోమ్!"

222

రాముడు, తనేగీసిన ఒక రంగుబొమ్మ చిన్నకాపుడుగారికి చూపిస్తూ,

రా—చూశారండీ బొమ్మ!

చి—చూశా. ఇంకావాగా ఉండాలంటే ఏంకావాలి, కొత్త రంగులా, కొత్తకుంచెలా ?

రా—అవేమీ పనికిరావండీ !

చి—కాగితంమీద వేస్తేనయమా, గుడ్డమీద వేస్తే నయమా. ఇంకా బాగుండడానికి ?

రా—అవీ పనికిరావండీ !

చి—మరి ?

రా—(వేలు గాలిలో తిప్పుతూ) నిరాధారంగా ఇల్లావేస్తే, నే అనుకున్నట్టు అచ్ఛంగా వచ్చేస్తుంది.

223

కమల—ఏమమ్మా ! లలితాంబగారూ ! మన విశాలాక్షి కాపరం ఇల్లా మారాముళ్ళయిపోతోందేం ? ముగుడూ పెళ్ళామూ ఎప్పుడూ మహాభారతంట, ఏం గ్రహచారమోగాని !

ల—ఏముందీ ? వీళ్ళ పెళ్ళిసమయంలో సన్నాయివాళ్ళు అపస్వృతిగా వాయించారట !

క—స్వృతేకాదు అల్లాయితే, లయకూడా తప్పిఉంటుంది.

ల—అదెల్లా ?

క—ఇప్పుడు అన్నీ దెబ్బలేకాని ఉసి ఒక్కటీలేదు.

224

సూర్యానికి తేలుకుట్టగా సదాశివుడు మంత్రంవేస్తూ

స—ఎక్కడ, కుట్టిందీ ?

సూ—కాలిమీద.

స—ఇంతేగదా ! నీకు కాళ్ళులేవనుకో, పోయిందా ?

సూ---అల్లా అనుకుంటే కింద పడాలి. ఏమీపోలేదు.

స—ప్రపంచంలో తేళ్ళులేవనుకో—పోయిందా ఈమాటు ?

సూ—ఇదివరకి చిమచిమలాడేది ఇప్పుడు అగ్నిహోత్రం తుంతయింది.

స—(ఊది) ఈ మంత్రంతో కుదరకపోతే బ్రహ్మొదు లొచ్చినా ఇంతే. ఈ మాటు పోలేదూ ?

సూ—పోయిందయ్యా మహాప్రభో !

పక్కనిఉన్న సుబ్బన్న—నిజంగానే సూర్యం ?

సూ—నిజంగానే, ఈయన నన్ను పెడుతూన్న బాధముందు.

225

చిదంబరం కొత్తసైకిల్‌మీద పోతూండగా ఒక మేష్టరుగారు ఎదురై,

మే—ఏమోయ్ ! నీకు పెళ్ళిఅయి ఎన్నాళ్ళైంది ?

చి—స్వధనం రెండువందలండి, "లైటూ" "బెల్లూ" కలుపుగుని.

మే—ఒప్పుగున్నాం !

226

ఒక నల్లదొర తను "మాజిక్," చేస్తానని ఒక పల్లెటూరిలో కొన్ని నోటీసులు గోడలకి అంటించి మరికొన్ని స్వయంగా జనానికి జారీచేయగా, మర్నాడు చంద్రుడూ అనంతం దాన్ని గురించి మాట్లాడుకుంటూ,

చం—అయిందిటగా, "మాజిక్" రాత్రీ !

అ—లేదుటథా,

చ—అబ్బ అయిందిట.

అ—లేదు. నామాట కాస్త వినుమరీ, దాంతగలెయ్యా! పొద్దున్న ఆయననోటంటేవింటా. ఒక్కడూ రాలేదుట.

చం—అల్లాఅయినా, అయిందన్నమాటేరా!

అ—లేదురా.

చం—నీమొహం! ఒక్కడూ రాకపోడం ఏమిట్రామరీ, "మాజిక్" కాకపోతే?

227

రాముడు—వసిష్ఠగారూ! మీరు యజ్ఞంచేశారూ?

వ—ఆ.

రా—ఎందుకండీ అదిచెయ్యడం?

వ—ముక్తికోసం.

రా—అంటే?

వ—అంటే, రంభాసంభోగం! తెలిసిందా?

రా—ఈమాటు తెలిసింది. మీరొక్కరేనా ఇది చేస్తా?

వ—ఏడిసినట్టేఉంది. మా ఆవిడ కూడాలేకపోతే యజ్ఞం ఎల్లా చెల్లుతుందీ?

రా—అల్లాయితే ఆవిడముక్తి ఏ భోగంతోటీ?

228

యాచన నిమిత్తం వచ్చిన ఒక అవధాన్లు, రాముడుగారితో,

అ—చూశారూ, పంతులుగారు! మీదయ! ఘనా, జటా, తల్లకిందులుగా కత్తిమీద అప్పగించగలవాణ్ణి.

రా—మచ్చు చూతాం, కేశవనామాలు తల్లకిందులుగా కానీండి ప్రస్తుతం!

అ—(చెప్పలేక, తెల్లపోక) చిత్తం. ముందు తమరు ఏప నామాలో చెప్పండి, తరవాత వెనకనించి చెబుతాను.

రా—(తెల్లబోతూ) నాదాకా ఎందుకు మావాణ్ణి పిలుస్తా నుండండి. అమ్మా! నాకు నామాలే రావనా?

అ—నామాలు రావనికాదు, పంగనామాలు వచ్చుననీ!

229

భోజనాలపందిట్లో పరిషించిన కాస్సేపటికి.

ఒక మొగపెళ్ళివాడు—(హేళనగా) ఈ ఉసిరీపచ్చడి ఏం ఫకడుగా ఉందండీ! నాలిక్కి రాచుకునేసరికి అమాంతంగా జిహ్వ వెనక్కి లాక్కుపోతోంది. ఎందుకు చేసినట్టిదీ?

ఒకఆడపెళ్లివాడు—బహుశా, వడ్డించడానికే అయి ఉంటుంది.

230

సామాన్యప్లీడరైన గిరీశాస్త్రిగారు రాత్రి పదకొండు గంటలకి బయటికివచ్చి, అరుగుమీద జనం పడుకుని ఉండడం కనిపెట్టి.

గి—ఎవరువారు?

ఒకడు—మేం పార్టీలమండి.

గి—అయ్యో వెఱ్ఱిమొహాలా! నన్ను లేపకపోయారా?

ఒ—వకాల్తనామా ఇవ్వడానికి రాలేదండి.

గి—మరి?

ఒ—అదుగో! ఆ యెదురుగుండా ఉన్నాయనికి ఇచ్చేశామండి.

గి—పగటి మీకు కళ్ళకనిపించి నా బల్ల దృష్టికి రాలేదూ? ఇప్పుడు స్థలంకోసం వచ్చిపడ్డారా? ఛంపేస్తా. లేచిపోరేం? ఛీ మొహంమండా! కర్రిల్లాతేవే!

231

సోమన్నగారి ఇంట్లో ఆబ్దీకానికి భోక్తలైన వీరయ్యా సుబ్బయ్యా తేచింతరవాత, పారణనైవేద్యం పెట్టవలసి, సోమన్న తనభార్యతో,

సో—చూడవే! అరిసిముక్క పట్రా ఓటీ!

భా—అల్లాకాదు, బెల్లంముక్క ఇదిగో, ఉంచండి.

అనగా ఆ ఇచ్చినదానితో ఏదో కానిచ్చి, ఇకబ్రాహ్మలు అక్షతలు పెట్టుగుని వెళ్లిపోతూండగా, తను అదివరకే ఇంట్లోకి వెళ్లి, వండిన ఎనభైరెండు అరిశెల్లోనూ ఒకటి మాత్రమే వీరయ్యా తతిమ్మా ఎనభైఒకటీ సుబ్బయ్యాతినేసి పారేశారని తెలుసుగుని, సోమన్న, వచ్చి, నడుంకట్టుగుని సుబ్బయ్య పాదాలమీద పడి,

సో—బాబూ! నిన్ను బుద్ధితక్కువచేత భోక్తగా ఉండ మన్నాను. ఇహ నా జన్మలో పిలవను. అనంతరంగుడా నిన్ను పిలవనని మావాడుఒట్టు వేసుగోకపోతే నేను పోనేపోను.

సు—మీనాన్న నాలో ప్రవేశించి చూపెట్టిన మహిమకి నన్ను స్తోత్రాలెందుకోయ్, వెర్రివాడా!

232

అమృతయ్య—ఏమండీ! వెంకట్రాయారిసుబ్బరాయారూ! కళ్ళెర్రపడ్డాయేం, రాత్రి నిద్దర్లేనట్టు?

వెం—నిన్న బీంవాఁరం కాపీవుచేలుకి యెల్లానండీ. యెల్లీ, నాలుగు పుంజీలు యిండ్లీ, ఓ పెద్దచెంబుడు కాపీ యిమ్మన్నా నండా!

అ—ఇమ్మంటే ?

వెం—టీ యిచ్చాడు గాబోసును ఆ సచ్చినోడు ! నిద్దర తేలిపోయిందండా !

అ—అదా ! అయినా ఫర్వాలేదు, పట్టుగోవచ్చు. ఎక్కడికి పోతుందీ మనదైనప్పుడూ !

233

అచ్చయ్యగారు, తన కొడుక్కి—కూతురున్నూ మూడేళ్ళదిన్నీ అయిన లచ్చన్మతో.

అ—ఈవాళ మాట్టాడకూడదమ్మా. జాగ్రత్తగా కూచోవాలి. మనింటో ఈవాళ తద్దినం అమ్మా ! తాతయ్య తద్దినం !

ల—తాతయ్య తద్దినమా !

అ—మరేనమ్మా. అల్లరి చెయ్యకూడదు.

ల—సరేగాని తాతయ్యా ! తద్దినం, నీదా, అమ్మగారి తాతయ్యదా ?

234

కొత్తగామాటలొచ్చిన సుశీలతో.

తల్లి—అమ్మాయి, చంటీ ! పొద్దున్న అంతేడుపు ఏడిచావేమే, ఊరూనాడూ ఏకమయేటట్టూ ?

సు—నిబద్దేటే ? అంతేడుపేడిచానా ?

త—నిబద్ధేనే ! రోజూనూ !

సు—రోజూఅయితే, పోనీ నాచేత కందనోంపట్టించి ఉద్యాపన చెయించు, ఏడుపు పోతుందేమో !

235

ఒక సాహేబు దొంగతనం నిమిత్యార్థం తొమ్మిదింటికే ఒక షాహుకారు ఇంటివెలిసిమీద సోగయాచేసి ఉండడం

షాహుకారు కనిపెట్టి చుట్టుపక్కల కోమటి జెమాజెట్టించి కేక వేసి, సాహేబు చేతులో బిందె ఓటి పెట్టించి వాణ్ణి దంచుతూ పోలీసు ఇకస్పెక్టరు ఎదటికి ఈడ్చి,

షా—ప్రభువోరు కటాచ్చించాలి, ఈ లుచ్చాగాడు నాసరుకు దోచుకుపోతూంటే పట్టుగున్నాంబాబు! సూడండి బింది.

కొందరు—మరేనండి. అవునండి,

సా—(దోసెడుమట్టి పోగుచేసి నోట్లో పోసుగుంటూ) మీకి బిందీవాడ్ నాకీ తీశామ్? హెండ్యూక్అన్యాయం మర్లీ! హామాట్కి వాస్తే. హద్దంకన్నా దొంగ్తనమ్ హెక్వా!

236

దేశాంతరం సర్కీటుతిరగడంలో ఆస్తిఅంతా హారతికర్పూరం చేసుగున్న చెంచుగారు, ఎల్లానైతేం చివరికి స్వగ్రామం జేరుకుని "లండను" వెళ్ళి దిగుతూన్నట్టు నలుగురితోటీ ఫరఫరలాడించడం అంబయ్యగారు విని,

అం—తమరు లండన్లో ఉన్నది ఎన్నాళ్ళూ?

చెం—గ్రేట్ వైల్. చాలాకాలం.

అం—మీరు "హౌస్ ఆఫ్ లార్డ్సు" వీక్షించారూ?

చెం—వాట్! చూడకేం. సాక్షాత్తూ ఒక హౌస్ ఆఫ్ లార్డు గారి ఇంట్లో భోజనంకుడా చేస్తేనే!

237

పల్లెటూరి రాజుగారు రత్తయ్యచేత పంపించిన తెల్లచెక్కెర కేళీగెల, రత్తయ్య, తిన్నగా బస్తీలోఉన్న ఒక కోమటి మేజస్ట్రీటుగారింటికి పట్టిగెళ్ళి వీధిసావిట్లో పనిచూసుగుంటూన్న మేజస్ట్రీటుతో,

ర—దణ్ణాలండి, తమకి ఇది రాజుగారు అంపారండి.

మే—ఆ గడ్డి మాకు వద్దు. పో.

అనేసరికి రత్తయ్య సాగిపోగా, అదంతా లోపల్నించి విని, మేజస్ట్రీటుగారి భార్య సావిట్లోకి వచ్చి,

భా—మీ కేమన్నా మతిగాని పోయిందాయేమిటి? ఒంట్లో తెగ వేడివేడని ఏక దేవుళ్ళాడుతూంటిరి! రమ్మనండి ఈ పాటికి వెనక్కి. ఎవరేనా పుచ్చేసుకోగల్రు.

మే—అల్లానా! సరే మరీ.

అనిచెప్పి, ఆమట్టున వీధినిబడి, గోచీయేనా ఏశ్రేణికి పోయిందోకుడా చూసుగోకుండా అరిటిగెలవాణ్ణి వెనక్కితిరగ మని ఉఱుమగా, వాడు వచ్చింతరవాత వాడితో,

మే—సరేనోయ్, పోనీ అప్పగించు ఇంట్లో!

ర—చిత్తం. రాజుగా రిచ్చిన సీటీ సదివించానండి. సదివిత్తే, సదివినోడు ఇది ఓరిశీలుగారి కివ్వాలని సెప్పాడండి.

238

పరదేశి—తమరేనా, వెంకన్నగారంటే!

వెం—అవును. ఏం?

ప—ఏంలేదండి. తమరింటికి భోజనాని కొస్తాను.

వెం—వీలు లేదండీ. లేకపోతే ఎల్లానో అల్లా యిది చెయ్యచ్చా!

ప—అహాఁ. తమరు నిరతాన్న ప్రదాతలని చెప్పారు. మరో మాట చెప్పకండి నాదగ్గిర.

వెం—అబ్బా! మళ్ళీ అదేమాటా!

ప—అల్లాకాదండి. ఇల్లాపోసిండి. చెప్పాగా ! పెట్టుబట్టతీస్తా.

వెం—మాకు పురుడండీ, ఈవాళకాదూ ! లేకపోతే భాగ్యమామిటి పట్టైడన్నం :

ప—అవుంట, కనుక్కున్నా. నాకూ పురుడేనండి. మాతమ్ముడికి తొల్చూరు కొడుకూ ! ఈవాళకారే. పట్టుబట్ట తీస్తున్నా.

వెం—ఓరి నీ తస్సలమందూ ! నీ పురుడు మాయింట్లో కలపాలనా ! మాకు పురుడూలేదు బుగ్గీలేదూ !

ప—నాకూ అంతేనండి నాకు తమ్ముడేవేడు. పట్టుబటతీశా !

239

మొదటిసారి నిశ్శబ్దపు సినిమాకివచ్చిన విస్సన్నతో గోపాలావు సినీమా చూస్తూ,

గో—ఎల్లావుందిరా, బావా, సినీమా ?

వి—వెధవమాటలూ వీళ్ళూ, మరీ నిమ్మళంగా మాట్లాడుతున్నారోయ్ ! గొంతుకలు పూడాయ్ పీనుగులికి, గొల్లచల్ల దాహం పుచ్చుగున్నట్టు !

240

పంచదార నీళ్ళల్లో కరుగుతుందని పిల్లలదగ్గిర్నించి రాబట్టి, కరగడాన్ని గురించి పాఠం చెప్పదల్చుగువచ్చిన రామన్న మేష్టరు,

రా—నీళ్ళల్లో పంచదార వేస్తే ఏమవుతుంది ? రొండోవాడు !

రొం—పానకం అవుతుందండి !

రా—(చికాకుపడి) అల్లానా ! నువ్వు ఎవరబ్బాయివి ?

రొాం—మావాళ్ళు అబ్బాయినేసండి.

రా—(కొంచెం కోపంతో) ఎవరు మీవాళ్ళూ ?

రొాం—మాఅమ్మా, మానాన్నా, మాబామ్మా, మాచెల్లాయీ వాళ్ళూసండి.

రా—(ఇంకా కోపంతో వెళ్ళి పిల్లాణ్ణి ఒక్కలెంపకాయ కొట్టి) అబ్బా !

రొాం—ఎందుకూ నన్నుకొట్టడం ? మళ్ళీ యింకోటికొడితే దవడపళ్ళు ఊడిపోను. ఈపాటి !

241

వేదాంతం చదువుకున్న ఒక మేష్టరు గణితం బోధిస్తూ ఒక లెక్క కొంతవరకే పదిలంగాచేసి, తుదనెగ్గడం విషయం అప నమ్మకంతోచి, బోర్డుమీద తను రాసినంతమట్టుకు చేత్తో చూపించి పిల్లలతో,

మే—ఇల్లానే కొంతదూరం చేసుగుపొండి. ఆన్సరు ఎదురు గుండా చక్కావస్తుంది. కర్మకాండ అంతాయింతే !

ఒకపిల్లాడు—అవునుగానండీ, సరియైన అన్సరు రావాలంటే, జ్ఞానకాండ వేరుగాఉండవలసి వచ్చేటట్టు తోస్తుందండి !

మే—అపుసు నీ జ్ఞానకాండలా ఉండకూడదు.

ఒ—ఏమండీ ?

మే—యోగం !

242

బంగారు—ఎమోయ్ ! ఏంజెప్పినా, ఉఁ ఆఁ అనవాయిరీ. ఉసూరుమని ఉంటూంటావ్ ! ఏమిటీ ?

శేష—ఏముటో! ఏమిలేదూ?

బం—నవ్వనేనా నవ్వవేం?

శే—సరేగాని, ఒరేయి, నువ్వు "విట్టు" వేద్దాం అనుకున్నప్పుడు కాస్తంత ముందుగా నాతో చెబుతూండేం!

బం—ఎందుకూ? ఎక్కించుగుంటావా?

శే—కాదు, నవ్వుతూండాలి, అలవాటుగా!

బం—అదిటోయ్! నేనేమీ అనుకోనులే!

శే—నేనెరగనుట్రా! కాని, రేపుమరొకరవుతుంది. నా అలవాటుకోసం నేచెప్పింది!

## 243

రామేశం నాలుగోఫారం, వెంకటేశం అయిదోఫారం చదువుతూ సంవత్సరపరిక్షలో, పేపర్లల్లో, ఒక్కొక్కడికిచ్చిన పదేసి లెక్కలకీ నాలుగేసింటికి కాపీ తెప్పించుగుని ఎక్కించినా ఫేలయిపోయి, తరవాత కలుసుగుని.

రా—పదింటికీ నాలుగేసి లెక్కలు చేశాం. ప్యాసుకావలిసిందే, మరీ! ఆ స్కూలుఫైనలువాడు మనకి అవి తప్పుడుగా చేసి పంపించాడేమో!

వెం—అబ్బే. రైటేట.

రా—అయితేమరి దిద్దేవాడు కనిపెట్టి సున్నాచుట్టాడంటావా?

వెం—నా ఉద్దేశం అంతే. అదేనా వాడుకనిపెడతా వాడికి తెలివితేటలుండికాదు. మన గ్రహపాటుకొద్దీనూ! నా లెక్కలు నువ్వూ, నీలెక్కలు నేనూ కాపీచేశాంట!

244

తిరుమలరావు—గోపన్నా ! నిన్న వెడతానన్నావ్, వెళ్ళి సౌందర్యభవనం చూసివచ్చావ్ ?

గో—ఆ.

తి—అద్భుతంగాలేదూ ?

గో—ఏం అద్భుతం. నాపిండాకుడూ !

తి—లోపలికివెళ్ళి చూస్తే ?

గో—లోపలికివెళ్ళి కాస్తకాస్తే చూస్తే ఓ మోస్తరుగాఉంది. కాని ఏకమొత్తంగా, బాహ్యానికిమాత్రం మా చెడ్డ అసహ్యంగా ఉంది.

తి—ఏర్పాట్లన్నీ చేశారేమరి ! పోనీ కట్టుదిట్టంగాలేదూ ?

గో—నేవెళ్ళి కొన్నిమార్పులు చెయించిన తరవాత రాయిలా ఉంది.

తి—ఏమిటవి ?

గో—కొన్నిచోట్ల విస్తారం సాలిగూళ్ళుంటే అవి తక్షణం లాగించేశాను.

245

కృష్ణమూర్తి—సరవయ్యా ! మనం మహాధూకుడుగా నడుస్తున్నాంగాని, ఏముచ్చుగుంటూడు, ఈ వంటపూటివాడు ?

స—మనిషికి ఐదణాలు,

కృ—ఇంకేం, అల్లాయితే లోపలికి పద.

స—ఏం ? అంత కసిగా మాట్లాడుతున్నావ్ ?

కృ—ఏం లేదు. భోంచేస్తేనాకు అయిదణాలులాభం,

స—లాభమా?

కృ—అడ్డమా! నడు. నీకే తెలుస్తుంది.

246

సూరన్నగారు ఒకగొప్ప రాజువేషంవేసి, అభినయిస్తూ ఒక కష్టసమయంలో.

తా—"హా! తుదకు నా అవస్థ ఇంతకు వచ్చెగా!" అని విచారిస్తూండగా, సూరన్న స్నేహితుడు ఒకాయన నాటకం చూస్తూ, ఆ మాట నమ్మక,

స్నే—అల్లాంటావుగాని నీకేమోయ్ హాయిగానూ! నెలకి వంద జీతమాయిరీ! మెళ్ళోపూసలూ! తీపుతీసిందీ?

247

రామానందం, తనకోసం కుట్టిఉంచిన చొక్కాతొడుక్కొని తృప్తిపడక, పనివాడితో.

రా—నిరుడు, ఎక్కడున్నావోయ్?

ప—చెన్నాపట్నంలో, సార్.

రా—అక్కడెక్కడ?

ప—"మోజస్" కంపెనీలోనండి.

రా—ఏంపని చేసేవాడవ్ అక్కడ?

ప—పోగేసేవాణ్ణండి.

రా—అందుకనే చొక్కా ఇట్టావుంది.

ప—అబ్బే, గారంటీగా కుడ్తే, ఏంటండీ అట్లా సెలవిస్తారు! తొడుక్కుచూడండి, ఇక వొదిలిపెట్టరు.

రా—అవును. నిన్ను వొదిలిపెట్టకుండా నీ చుట్టూ తిరగాలి.

248

వెంకట్రావుగారు గుమ్మం దిగేసరికి లింగమ్మగారు ఎదురు కాగా,

వెం—లింగమ్మా! వొచ్చావ్ ఎదురుగుండా! నా పని యీ పక్షానికి కాదు. ఎన్నింటికని ఏడవన్నా. భగవానుడా!

లిం—సరే. వొచ్చావ్, నా ప్రాణానికి, ఎదురుగుండా. ఒంటి బ్రాహ్మడివి! నా పని యీ మాసానికికాదు! నేను మాత్రం ఏడుచుకోడంలేదూ?

వెం—అల్లాయితే ఓ పనిచేస్తే మంచిదీ!

లిం—ఏమిటది?

వెం—ఇద్దరికీ ఏడుపే అయినప్పుడు కలిసి ఏడిస్తేనే నయం.

249

మనమడు—బామ్మా! ఈజాతిబొమ్మ చూశావ్? అచ్చంగా బతికిఉన్న పిల్లాడే! అనాలట్టలేం.

బా—మరేరా అబ్బాయి. అయితే ఇవెల్లా సృష్టిస్తారొరీ?

మ—పోతపోస్తారట!

బా—సరేకాని, ఇది ఒక్కొక్కటి ఏ మాత్రం?

మ—అయిదేసీ ఆరేసీనూ!

బా—అబ్బో. ఏం ధరా! నా చిన్నతనంలో పిల్లలు వాళ్ళంతట పుట్టుకురావడమేగాని, డబ్బోసి పిల్లల్ని సృష్టించడం అంటూలేదు.

250

ఉమాపతి—ఏమోయ్, కామేశా! రావుగారు రాజకీయంలో కృషి చేస్తున్నాడుగదా! ఇప్పటికి ఏం చేసినట్టూ?

కా—రాజకీయంలో ఎమిటయ్యా చేసేదీ! రాజకీయానికీ ఆడతనానికీ బోలెడు సంబంధం ఉందీ!

ఉ—అదేమిటి, అల్లా అంటున్నావు?

కా—రాజకీయంలో, ''అల్లానే'' అని పలికితే "బహుశా" అన్నమాట. "బహుశా'' అని అంటే ''లేదుపో" అన్నమాట.

ఉ—''లేదుపో'' అని చెప్పేస్తే?

కా—రాజకీయమే కాదు. అవునా, ఇక ఆడతనంలో. ''లేదుపో''. అని అని చెప్పేస్తే "బహుశా" అన్నమాట, "బహుశా" అని అంటే "అల్లానే'' అన్నమాట. ''అల్లానే" అని పలికితే ఆడతనమేకాదు. అందుకని వీటికి చచ్చినంత సంబంధం.

ఉ—నువ్వు చెప్పిందాన్నిబట్టి ఈ రెండింటికీ ఏమీ సంబంధం లేదని తేలింది.

కా—ఎవేనా రెండింటికి సంబంధం లేదని తేలినా, ఉందని తేలినట్టే!

ఉ—ఏం! ఎల్లా?

కా—ఆ రెండింటినీగురించి మాట్లాడ్డమే సంబంధంగా!

251

పంతులు, ప్రశ్నతప్పిన కుర్రాణ్ణి చూసి,

పం—ఉండు! రేపు తాడేపల్లిగూడెంసంత రానీ;

కు—ఎందుకండీ?

పం—కూడా నిన్ను తీసికెళ్ళి నీకు ఓ జత పోతుల్ని కొనిమ్మని మీ నాన్నగారితో చెబుతాను.

కు—ఓటి చాలండి.

పం—ఏం ?

కు—కూడా మీరుంటారుగాదండీ!

పం—కూడాఉండేది మీ నాన్న, పైన నీ యిష్టం!

252

దూరపుచూపు ఆనని శోభనాద్రిగారు తన స్నేహితుడు బాలయ్యతో పిట్టల్ని కొట్టడానికి వెళ్ళి, ఒకచోట, నిలబడి ఉండగా,

బా—అదు గోనండోయ్, కొమ్మకి చిటారురొాబ్బని! అడివి పావురాయి. కొట్టండి, కొట్టండి.

శో—సరే. అల్లానే. మాట్టాడకండి. అదికాస్తా ఎగిరి చక్కాపోగల్దు. కాని, అదిఉన్న వేపుకి చిన్నరాయి వెయ్యండి, నాకు బోధపడుతుందీ!

253

బాలామంది స్నేహితుల్తో కూచుని కామయ్య మాట్టాడు తూండగా సుందరం గబగబావచ్చి,

సు—ఏమిటండీ విశేషాలు ?

కా—ఏమున్నాయి!

సు—ఏమిటి, వీళ్ళదగ్గిర ఊరిఖే కోతలుకోస్తున్నారు ?

కా—రామరామా! ఏం లేదండీ! మీరు మంచివారని చెబు తున్నా.

254

కోటయ్య—మీ సుబ్రావ్ ఎక్కడున్నాడండీ, కోనేటిరావు గారూ ?

కోనే—బందర్లో.

కోట—ఏం చదువుతున్నాడు ?

కోనే—ఇంటరుమేటు.

కోట—ఎక్కడా ?

కోనే—హిందూ హైస్కూల్లోట.

255

ఒక మగపెళ్ళివారు, రాత్రి, బాజాలతో భోజనానికి బయల్దేరి, వెనకాల ఆడంగులూ ముందు మొగంగులూ నడక నడుస్తూండగా, కాగడావాడు ఆడంగులదగ్గిరే ఆగిపోగా, మగవారిలో ఒకరైన

ప్రసాదరావు—ఒరేయి కాగడా ! మాకు వెలుతురు లేదురా !

కా—వెనకాల ఆడంగులండి బాబూ !

ప్ర—సరే, ఏడిసినట్టేఉంది. ఇక్కడ మేంమాత్రం !

256

సన్యాసి—(ఇంటివారితో) పోనీ మీరన్నట్టు నేను కామమ్మ మొగుణ్ణి కాకపోతే నా కర్రాబుర్రా నాకు పారెయ్యండి ! వెధవ గోలొచ్చిపడింది. వీళ్ళగోల మండిపోను !

ఒకస్త్రీ—ఏమిటి నాయనా ! అన్నీ అయాయిరీ, ఇంకా పైపెచ్చు ఏముటోచికాకు పడతావు, ఏం రోగం ? నీ చికాకు చిచ్చంటించా !

స—చికాకా చికాకున్నరా! ప్రతీఊళ్ళోనూ ప్రతీకొంపలోనూ నాకు ఇల్లా అవుతూంటేను !

257

సుబ్బారాయుడు వనమయ్యగారికి ఉత్తరంరాసిపెడుతూండగా చిదంబరంగారు వచ్చి,

షి—ఏముటోయ్ సుబ్బారాయుడూ ! పెదిమిలు బిగపట్టావ్ ! బొమ్మలు ముడెట్టావ్, కలం పట్టట్టావ్, స్వరుమనిపించేస్తు న్నావ్, ఏమిటదీ ?

సు—నీ కెందుకుపోవయ్యా ! ఆయనేదో నా కాళ్ళు పట్టు గుంటే ఓ ఉత్తరం గోకిపెడుతున్నాను.

చి—అల్లాఅయితే వనమయ్యా ! నువ్వు వసుదేవు డంతటి వాడవని ఇప్పటికి విశదంఅయింది.

258

సుబ్బకవి—ఏమండీ లచ్చయ్యగారూ ! ఈ మధ్య మీరు మెడ్రాసు వెళ్ళివొచ్చారటా !

ల—మరేనండి.

సు—వ్యవహారపు పని గావును.

ల—మరేనండి. కొన్నికృతులు చేశానుగా !

సు—ఆ కృతులు అచ్చుకొట్టిద్దామనా ?

ల—మరే.

సు—అయితే త్యాగరాయకృతులు చేసింది మీరేనా ఏమిటి !

259

బేరగాడు—షాహుకారూ ! తమలపాకులు మోదెల్లా ?

షా—మూడణాలండి. ఏమాత్రం ?

బే—వందెల్లా ?

షా—ఏడుకాన్లు ఇవ్వండి.

బే—కానీకి ఏమాత్రం వస్తాయి ?

షా—ఇంతేటండీ బేరం ! పదీ !

బే—ఓ దమ్మిడీవి కట్టూ!

షా—కొన్నా వెల్లవయ్యా!

బే—కొనందే, ఎల్లా వెళ్ళడం?

షా—ఊరికే అడగరాదూ నాలుగూ!

బే—నీ యిష్టం, పోనీ అల్లాఅయినాసరే.

260

సీనయ్యా బాపయ్యా కాలవగట్టున పళ్ళు తోముకుంటూ కూర్చున్న సమయంలో, ఒక యానాదిమనిషి, అచ్చంగా సీనయ్య అప్పుడు కప్పుగున్న శాలువలాంటి శాలువే కప్పుగుని గట్టంట పోతూండగా,

సీ—ఏమే అమ్మి! ఎల్లాకొన్నావ్? శాలువ?

యా—రొండున్న రండి బాబూ!

సీ—చూశావోయ్, బాపయ్యా, ఆడ పీనుగుల తెలివి తక్కువా? అదీ ఇదీ సరిగ్గా ఒకటేగదా, ఇది నేను అయితే అయిందని రూపాయిన్నరెట్టి పట్టుగొచ్చాను.

యా—బాబూ, చిత్తగించండి, తెలివితక్కువ ఏ పీనుగు లదో! నేను నా శాలువ వేలంలో పదణాలిచ్చి పుచ్చుగున్నా వండి!

261

సీతన్న తన క్లాసుమేష్టర్ని ఇంటిదగ్గిర కలుసుగుని,

సీ—మేష్టారండి! రోజూ పొద్దున్నే రొండుఘంటల పాటు పుస్తకాలు వస్త్రకాళితంకింద నూకేస్తే చాలదండీ? గొప్పవాడవడానికి?

మే—గంటేచాలు. పట్టుదలగా చేస్తేసరి.

సీ—నాకు పట్టుదలా ఉందండీ!

మే—ఏమన్నా పాతపాఠాలు చూస్తున్నావా?

సీ—అవన్నీ ఒచ్చునండి. చూడ్డం అవసరం లేదు.

మే—కొత్తవి ఏమన్నా చూస్తున్నావా?

సీ—అవి తెలియవండి. చూడ్డం లాభంలేదు.

మే—పోనీ కొంతకొంత తెలిసేవి చూస్తూంటే?

సీ—అల్లాంటివి ఉండవండీ. చూడ్డం దండగ! పైగా తీరా చూసింతరవాత పూర్తిగా తెలిసిపోతే!

262

తండ్రి—ప్రభా! ఇల్లా రా. బళ్ళోకి వెళ్ళొచ్చావా?

ప్ర—ఆ. ఆఖరుగంట మా మేష్టరు లేకపోతే, నాలుగో క్లాసుని పొమ్మన్నారు.

తం—ఏమేం అయినాయి పాఠాలు!

ప్ర—"కాంపోషన్" అయిందినాన్నా.

తం—దేన్నిగురించి?

ప్ర—"రైల్లో మూడోక్లాసు ప్రయాణం" గురించి.

ఆ పఠాన్ని మాక్లాసు పిల్లలంతా ఏకరాతే.

తం—నువ్వు?

ప్ర—ఒక్కముక్కలో రాసిచ్చేశాను నాన్నా.

తం—ఏమనీ?

ప్ర—"నేను రైలెక్కలేదు" అని రాసేశాను నాన్నా.

తం—ఇంకేమీ రాయ్యలేదూ?

ప్ర—"మూడోక్లాసులో రొండేళ్ళు ప్రయాణం చేసితిని" అని కూడా రాశానునాన్నా !

263

ఒకనాటకం ఆడుతూన్న సంచర్భంలో,

భీముడు—(సహదేవుడితో) తమ్ముడా చూచెదవేమి ?

సహదేవుడు—(ప్రాంప్టర్ని వినిపించుగోక) అన్నయ్యా చూచుటలేదూ !

ప్రాంప్టరు—(కోపంవచ్చి గట్టిగా) వినిమాత్రం ఏడిశావూ ! ఇందాకణ్ణించి ఛస్తూంటేను !

స—(ప్రాంప్టరుతో) ఛీ ! పేలకూ !

ప్రాం—ఊరుకోనా నామాట వినిపించుగోక నీ తాతల్లాంటి వాళ్ళు మారుపేరు పెట్టించుగున్నారూ !

264

శ్రీరాములు—ప్రయత్నించినా ఆనవాలు పట్టలేమోయ్. ఆ బ్రాహ్మణపునిస్త్రీ లిద్దరికీ తేడా బొత్తిగా తెలియడంలేదు నాకు.

పిచ్చెయ్య—బ్రాహ్మణకర్మ ధర్మానుసారం కొన్నాళ్ళకి తెలియచ్చు.

శ్రీ—అదా ! ఎంత కర్కోటకుడవ్ !

పి—మళ్ళీ కొన్నాళ్ళకి తెలియకపోవచ్చు

శ్రీ—మరే. అప్పుడు ముగ్గురుంటారు.

పి—ముగ్గురేమిటి ?

శ్రీ—నువ్వోమరీ !

265

రుక్కమ్మ—బతికుండిమాత్రం నన్ను ఏం సుఖపెట్టి ఏడిశారండీ! చెప్పుగుంటే సిగ్గుగాని, సోమమ్మగారూ! రాత్రి ఒంటిగంటేసిం తరవాత ఇల్లు వెతుక్కుంటూ వచ్చేవారు

సో—మరేనమ్మా. ఎవరెరగనిదిదీ! ఆయన ఎక్కడ అణగారిపోయారో అని మీకు ఊరికే దుద్ధగాఉండి మీరు ఎంతో అంత ఇదయేవారు.

రు—ఇప్పుడు—నాగతి ఇల్లా కడుక్కుపోయిందన్న మాట గాని, ఆ దుద్ధలేదు, సోమమ్మగారు, మీ ధర్మమా అంటూ!

266

పాలరాజు—విన్నారా శివయ్యగారు! నా యీడున మానాన్న సరిగ్గా నాకుమల్లేనే ఉండేవాడుట.

శి—ఎవరాఅన్నది?

పా—మా అమ్మ కసుక్కుంటే తెలిసిందిట.

శి—పోయినవాళ్ళనిగురించి పోకిరీమాటలాడితే నీ కొచ్చిన లాభం ఏమిటని ఎవడేనా నవ్విపోయేరుగనకా, నోరుమూసుగూరుకో ఈపాటి!

267

కామేశ్వరరావు—సత్తెన్నా! ఏమిటి విశేషాలు?

స—అన్నీ సశేషాలే. సూరన్న ఉత్తరం రాశాడు.

కా—ఏమంటాడు?

స—మొన్న మా ముసలమ్మ ఆబ్దికంట.

కా—అయితే!

స—నేను పెద్దవాణ్ణికాదూ! "నువ్వు అది ఒక్కడవ పెట్టావా లేదా?" అని రాశాడు.

కా—నువ్వు పెట్టావా?

స—ఆ. "నువ్వొక్కడవ పెట్టేసేఉండి తీరాలి లేకపోతే వీలు లేదంటున్నారు. గ్రహించవలెను." అనికూడా రాశాడు మారన్న.

268

ఒక పిల్లవాడితండ్రి ఒక మేష్టర్ని కలుసుకుని,

తం—మావాడు మీవద్ద చెప్పుకుంటున్నాడండి.

మే—మీ ఇంటిపేరు.

తం—ఆదివారపువారు.

మే—ఓహో మందేశ్వరుడా! మీవాడు! సరే. ఏం? ఇప్పుడూ!

తం—వాడు బహు సుకుమారండి.

మే—అవును పాపం. చాలామంచిపిల్లలూ అంతే.

తం—అందులో వీడు మరీనండి, దెబ్బెరగడు. మీరు ఓ ముక్క చెప్పవలసిందేగాని ఏమీ ఇల్లా చెయ్యి వెయ్యాలయిస్తు కాదండి వాడి వొంటిమీద!

మే—నిజమేమరీ! నేరం మీవాడిదైతే తప్పనిసరి వొచ్చినప్పుడుతప్ప.

తం—అప్పుడైనా అంతేనండి.

మే—ఏం? ఎల్లా?

తం—నేరం మావాడిదే అయినా, బళ్ళో ఇంకా ఇతర పిల్లకుంకలు ఉంటారుకాదూ, వాళ్ళల్లో ఒకణ్ణో ఇద్దర్నో పచ్చడి కింద దంచండి, దంచితే మావాడు హడలిపోయి మళ్ళీ నేరం అన్నమాట చెయ్యడు.

269

హరిశ్చంద్రనాటకం జరుగుతూండగా, దేవయ్య కొంతసేపు జోగుతూ చూసి, ఉలిక్కిపడి పక్కకుర్చీ అయనతో,

దే—ఏమిండీ!

ప—అయ్య!

దే—ఆ పాపురాయిలసీను ఇంకా రాదేం? ఎగేశారా యేంటీశ్కు!

ప—తొందర పడకండి!

దే—తొందరేంటయ్యా! నుప్పొ అళ్ళపావతో, తేకపోతే నీది ఫ్రీ టిక్కంటో!

ప—ఉండవయ్యా! ఇందాకా వాటికోసం వెళ్లిన కుంభ కర్ణుణ్ణి రానిస్తావా?

దే—ఎప్పుడు? వొచ్చెల్లాడేం? సెప్పకుండా

ప—మూడునిమిషాలైంది, వాడొచ్చినా మీకు మెలుకువ లేదు.

దే—అయితే సరే.

270

రావుజీగారి గాత్రపాట పూర్తి అయిన వెంటనే అనేకులు ఆయన్ని అభినందిస్తూండగా,

ఒకశ్రోత—ఆహాహా! ఎన్నాళ్ళకి విన్నామండీ గానం! ఇల్లాంటిపాట ఇండియాలో లేదు.

రా—మీ దయవల్ల గ్రామఫోనువాళ్లు నాచుట్టూ తిరిగి తిరిగి పోతూంటారండి.

ఒ—ఏమాత్రం ఉన్నాయి తమరి రికార్డులు?

రా—రేటు కుదరక నేను ఇవ్వను పొమ్మన్నాను.

ఒ—ఎవ్వరూ అనుకోలేదు ! చివరకి నాకూ తెలియదే !

రా—తెలియకపోవచ్చు. "నాకూ" అంటే ఏమిటి అక్కడికి మహా మీరు !

ఒ—నేనా ! నేను ఇండియా మొత్తానికి గ్రామఫోను కంపెనీ ఏజెంటుని.

271

కొండయ్య—యాక్టరంటే రాజయ్యే యాక్టరు ! రాజు మొదలు ఆఖరికి వెధవముండ వేషమైనాసరే ఒప్పిస్తాడు.

చేస్లు—మరేపాపం. అందులో, విశ్వప్రయత్నమూ చేసి సకలశ్రమా పడతాడు ! పడాలికూడానూ :

కొం—వేషాలు వేసుకోడానికా నువ్వంటూంటా ?

చే—మరే రాజులాంటి వేషాలు.

272

శాస్త్రిగారు జనాన్న పోగుచేసి ఒక దొంగని తాచుపాముని పట్టినట్టు బరిమీద పట్టుగుని, కళ్ళబొడిచి, వాడి కాలిగూడు సడలగొట్టి, వాణ్ణి సాగనంపుతూ,

శా—పశువా ! బుద్ధితెచ్చుగు బతుకు ! నడు !

దొ—(చచ్చిచెడిలేచి కుంటుగుంటూ) మరినాకు నడిచే యేత్తులేదండీ !

273

పాలయ్య—బెజవాడ వెళ్ళొచ్చావురా శేషాచలం ?

శే—ఆ.

పా—పని ?

శే—పనే.

పా—బస ?

శే—బంధువులున్నార్లే.

పా—ఎవర్రా!

శే—ఆఁ! నాకు ఇస్తారనుకోరేమా!

పా—ఊఁ ఊఁ.

శే—ఆ పిల్ల అత్తారు.

274

మెల్లకన్ను రత్నాకరం ఒక గొప్ప రాణివేషంలో ఉండి భర్తృవియోగం అభినయిస్తూ,

రాణి—(విచారంతో) నా నాథుని తిరిగి కాంచు భాగ్యము నాకబ్బునా! హా దైవమా! నాకన్నులెట్టి దౌర్భాగ్యపు కన్నులూ!

ఒకసభ్యుడు— మరే. అందులో ఓటి మెల్లకూడానూ!

ఒకకుర్చీదాసు—సైలెన్సు ప్లీజ్!

సభ్యుడు—ఈమాటకి వెనకేసుగు రావడంకూడానా! బాగానేఉంది గుడ్డిలోమెల్లకి దల్లకిందులు!

275

"ఇంటరుమీడియేట్" చదువుతూన్న మియ్యా తన విద్యాశాఖవాడే అయిన కమలాకరాన్ని కలుసుగుని,

మి—కమ్లాకరం! నిన్న లెస్సన్ను హేమ్టీఅయిందీ?

క—ఏం? నువ్వురాలేదూ?

మి—లేదూఓయ్!

క—ఏమిటి కమామీషు!

మి—మాది సెల్లైట్ హీనింది.

క—అదేమిటోయ్, నీముండా మొయ్యా! అల్లా అంటే ఎవడేనా జాన్ను తెమ్మంటాడు. ముఖ్యమైన అశ్లీలాలు ముందుగా నేర్చుగుని మరీమాట్లాడు, అన్యభాష!

276

మూర్తి—ఎంచెయ్యమన్నావ్, బ్రహ్మం ! జీతం ప్రమోషన్కి పిటీషను పెట్టుగున్నాను, జవాబు లేదూ. నాలుగు రిమైండర్లు కొట్టాను. వాటికీఅంతే. నాకేనా సిగ్గుఉండద్దూ ? ఏం మొహం పెట్టుగుని అయిదో రిమైండరు పంపడం, అని చూస్తున్నాను.

బ్ర—కొత్త రిమైండర్లు ఇక తగిలించకు.

మూ—ఒక్కొక్క రిమైండర్కే మెల్లిగా రద్దుపిటీషన్లు జారవిడుస్తూండమంటావా !

బ్ర—మరే. అనుకున్నపని అవుతుందిగా !

277

వర్మ—ఏమోయ్, శర్మా ! నలుగురు కూలివాళ్ళనీ పంపించానుగదా సామగ్రి మొయ్యటానికి ! మళ్ళీ అయిదోవాడికోసం కబురంపించా వెందుకూ !

శ—అయిదోవాణ్ణా ?

వ—మరే.

శ—నిప్పుచ్చుగోడానికి.

వ—నిప్పెందుకూ ?

శ—తట్టతగలెయ్యడానికి.

278

చిట్టిబాబు—ఏమండీ, రామయ్యగారు ! భోజనం అయిందీ ?

రా—ఏదో ! అయింది.

చి—ఈవాళ కూరలేంజేశారు ? మీయింట్లో ?

రా—రోజూలాగే తిన్నేశారు. మీయింటో ?

చి—పారేశారు.

రా—దొడ్లోనా ?....ఒహో ! నోట్లోనా !

279

దామోదరం—నిన్న నేనిచ్చిన నవల చివరదాకా చూశారూ?

శాస్త్రి—చూశా చూశా. ఎటొచ్చీ ఆడమనిషి రాసిందన్న మాటగాని, ఏముటుంది అందులో గొప్పా !

దా—మొదట్లో నేనూఅంతే అనుకున్నాను. కాని అథాత్తుగా అభిప్రాయం మార్చుగోవలిసొచ్చింది.

శా—ఏం ?

దా—అది కమిటీవారు ఒక పెద్దక్లాసుకి పఠనీయగ్రంథంగా నియమించారు.

శా—వారు ఏదో కొంత సారం కనబడితేగాని నియమించి ఉండరు. ఈమాటు తెలిసింది. అయితే, నీకెందుకూ ఓఃగోడవా?

దా—నాకూ లాభం ఉంది.

శా—ఏమిటీ ?

దా—ఇదివరలో నేను రొండు నవలలు రాస్తే వాటిమీద ఇల్లా కాకివాల్లేదు. ఆ పళంగా, కానున్నది కాకమానదని చెప్పేసి ఇది ఓ ఆడమనిషి పేరట అచ్చెయించాను.

శా—ఎవరావిడ ?

దా—ఎక్కడా అనకండి, అల్లాంటి మనిషేలేదు !

280

ధర్మయ్య ఒక శాస్త్రుల్లుగారి ఇంటికి వచ్చి, చెప్పులు విడిచి దణ్ణమెట్టి కూర్చుని,

ధ—చాత్తుల్లుగారూ ! మా అమ్మాయికి రాగిడీ సెయించాను. ఈయాల మంచిడేమో, సూడండి కాస్త్తంత, యెట్టుగోటానికి.

శా—ఈవేళ బుధవారం కాదూ ?

భ—చిత్తం,

శా.—'కుర్వీత బుధసోమయోః' అన్నాడు ః మంచిదే,

281

ప్రైవేటుమేష్టారు—పుస్తకం చూడమ్మా. చూసి చదువు. ఇదిగో''

కుర్రాడు—''ఇదిగో''

ప్రై—''ఆవు''

కు—''ఆవుబొమ్మ. ''

ప్రై—ఛీ. పుస్తకంలో ఉన్న అక్షరాలుచదువు. ''ఇదిగో ఆవు''

కు—''ఇదిగో ఆవుబొమ్మ. ''

ప్రై—కళ్ళుమూసుగు చదువుతాడూ ! (అని కొట్టబోగా)

కు—(బిక్కమొహంతో) ఈపుత్తకంలో ఉంటా అవాండీ !

282

ఒక ఉపన్యాసకుడు అన్యదేశం వెళ్ళి ఊరూరా లెక్చర్లుఇస్తూ ఒకనాడు ఆదేశపు రాజుని కలుసుకోగా,

రాజు—వింటున్నాం ! వింటున్నాం ! తమరు అద్భుతంగా ఉపన్యసించడం !

ఉ—ఏదో. నాకేమి వచ్చునండీ, అసలూ ?

రా—అయితే మీరు ఊర్నిబట్టి మాట్లాడతారా, లేకపోతే ప్రతీచోటా అవే పలుకులా ?

ఉ—అవే.

రా—అల్లాయితే మీ లెక్చరు ఓ మాటు వినేసినవాడు రెండో మాటొస్తే చప్పగా ఉంటుందేమో !

ఉ—ఎంతమాత్రం ఉండదు.

రా—మీరెట్లా చెప్పగలరు ?

ఉ—రొండోమాటురాడు.

283

దొర—మిత్రమా ఏమిటి రాస్తున్నావ్ ?

స్నేహితుడు—ఒక వైద్యుడికి జవాబు.

దొ—ఏవిషయం ? చెప్పడానికి వీలుందా ?

స్నే—ఆ. సంవత్సరం కిందట నేను మోకాలు నొప్పు లన్నిటికీ "తారు" గొప్ప మందని పేపర్లో ప్రకటించాను.

దొ—అయితే ?

స్నే—అప్పట్నించీ ఒక వైద్యుడు ఆ నెప్పితోనూ నా మందు తోనూ సకల తంటాలూ పడుతున్నాట్ట, లాభం లేకుండా ఉందిట.

దొ—ఇప్పుడు జబాబేమనీ ?

స్నే—నా మోకాలు కర్రమోకాలని రాయడం అప్పట్లో మరచిపోయాననీ !

284

గుర్నాథం—కల్యాణం ! కలెక్టరు గొప్పా ? ఇంజనీరా ?

క—అనుమానం ఎందుకొచ్చింది అసలూ !

గు—సరే, కలెక్టరికి ఒకటే జిల్లా, ఇంజనీరుకి రెండూ.

క—సరే, అల్లాచూస్తే స్కూల్సుఇనస్పెక్టరిసు మరీ గొప్పది.

గు—ఏం ?

క—ఆవిడికి నాలుగూ !

285

లెక్చరరు—నువ్వు చెప్పే అర్థం ఈ మాటల్లో లేదు. అది షేక్స్పియరు అనుకున్న అర్థమూకాదు? అభిప్రాయమూ కాదు,

విద్యార్థి—ఏంచేస్తామండీ, క్షమించాలి. షేక్స్పియరు గొప్ప వాడే. కాస్తైతేం !

తె—కానయితేం ? ఏమిటి ?

వి—ఈ విషయంలో నేను షేక్స్పియరుతో ఏకీభవించను.

286

మేష్టరు—శంకరం ! కూచున్నావేం ? లేటుగా వచ్చిన వాళ్ళు నిలబడాలని తెలియదూ ?

శం—తెలుసునండి.

మే—మరి ?

శం—నేను లేటు కావంటి.

మే—"ఫస్టుబెల్" కొట్టేసిన తరవాత క్లాసులో అడుగెట్టి ఎందుకొచ్చిన అబద్ధం పట్టపగలు ?

శం—అబద్ధం లేదండి.

మే—ఏం ?

శ—ఈవాళ మొదటకొట్టింది "సెకండుబెల్" టండి. ప్యూను చెప్పాడు. ఇంకా "ఫస్టు" ది కొట్టాలిటండి.

287

సప్పయ్య—ఏమోయ్, రామలింగం ! నేను నీతో చెప్పిన కనకరత్నం సంబంధం మా అమ్మాయికి ఎల్లాఉంటుందని నీ ఊహ ?

రా—కనకరత్న సంబంధం ఎల్లాఉంటుందని నువ్వు మళ్ళీ ఓ కోన్క్లుస్కోహేని కనుక్కోవలసిన పనేముంది పోదూ !

288

భద్రుడు—ఒక తావు తీసుగుని దానిమీద పంక్తికి అయిదారు అక్షరాలచొప్పున నాలుగైదు పంక్తులురాసి మరోతావు పుచ్చుగుని రాస్తుండగా స్వామిశాస్త్రి చూసి,

స్వా—ఏమిటి రాస్తున్నావ్, భద్రుడూ! మీ కుర్రాడి కాపీలకి ఒరవడా?

భ—కాదు మా మేనమామ కొడుక్కి వ్రైవేటు ఉత్తరం.

స్వా—ఈ ఉత్తరం ఒకటే మింగేసట్టుంది కొన్ని రీములు!

భ—ఏమో! సొమ్మంతా ఇల్లానే పోతోంది.

స్వా—లిపి అంత పెద్దపన్నాగా పుచ్చుగున్నావేం!

భ—ఏంజెయ్యమన్నావ్? అవతల మా వాడికి బ్రహ్మ జెముడు, వీణ్ణి తగలెయ్యా, చచ్చిపోతున్నాను!

289

సూరన్న—వెంకన్నా! ఏం వారం ఈవేళా?

వెం—లక్షింవారం.

సూ—సుక్కురారంటగా!

వెం—ఎవరా అన్నదీ!

సూ—మా ముసలమ్మ.

వెం—ముసలమ్మలమాట ఎక్కడ నెగ్గుతుందీ! ఇందాకా అయిన మీటింగులో ఇది ఓటుకిపెడితే, అధ్యక్షుడి చివరఓటుతో మెజారిటీ లక్షింవారం అనేశారు.

290

రాజు, లక్ష్మయ్య చేతులో గొడుగుచూసి,

రా—ఏరా లక్ష్మయ్యా! నీ గొడుగు పోయిందనవ్!

ల—అవున్నా కాలేజీలో గొడుగులు పెట్టుగునేచోట పెడితే ఎవడో మర్యాదాగా తాంబూలం వేశాడు.

రా—మరి ఇదెవరిదీ? నీది కానట్టుంది!

ల—కాదు. కాకపోతేమాత్రం; ఎంజెయ్యనూ!



భమిడిపాటి కామేశ్వరరావు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య – టేలూర్స్, నర్సాపురం. కాలేజీ చదువు – కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. యే. (గణితశాస్త్రం). 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగ జూన్ 1953 లో ఉద్యోగ విరమణము. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తి కలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధి. చమత్కార సంభాషణలూ 'త్యాగరాజు ఆత్మవిచారం' అనే త్యా. గ్రా. రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, కోపం, శానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ రాయలసీమలోనూ నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.